జూన్/జులై 1971

21/22

రెంజిమ్

పాట

## చెల్లీ! చెంద్రమ్మా!

పరిచయం

## నజ్రుల్ యిస్లాం

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

వెల: ఒక రూపాయి

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాస పత్రిక

21 / 22

జూన్/జులై 1971

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

80 పేజీలు ఒక రూపాయి

ప్రతులకు, వివరాలకు:
4/729 కుమార్‌పల్లి,
హనుమకొండ,
వరంగల్–1. (ఆం. ప్ర.)

సంవత్సర చందా : పది రూపాయలు
అర్ధ సంవత్సర చందా : ఆరు రూపాయలు
విడిప్రతి : ఒక రూపాయి

ముద్రణ :
వేంకటరమణ ముద్రణాలయము,
జె. పి. ఎన్. రోడ్, వరంగల్–2.

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

జూన్/జులై మాస పత్రిక 21, 22

కవితలు :



కథలు :



పరిశీలన :



ప్రశంస :



సమీక్షలు :



పరిచయం :

## చేదు నిజాలు

సృజన ఆర్థికంగా కష్టాల్లోపడ్డదని జూన్–జులై సంచికలు ఒకటిగా, ఎక్కువ పేజీలుకూడ లేకుండా మామూలుగా ఎప్పటివలెనే రావడాన్నిబట్టి పాఠకులే గ్రహిస్తారు. ఇది మాకుకూడ ఏమీ సంతోషంగాలేదు. కాని మేం అసహాయులమైపోయాం.

సృజన త్రైమాసికగా ఉన్నపుడు ఆర్థిక, సాహిత్య సమస్యలను సర్దుబాటుచేసుకోవడానికి కొంత తెరపి వుండేది. కాని యువతరంలో లావావలె పొంగుతున్న సాహిత్య తృష్ణను తీర్చడానికి పత్రికను మాసపత్రికగా మార్చాల్సిన బాధ్యతను స్వీకరించక తప్పలేదు. ఫలితంగా, మీరు యిదివరకిచ్చేదానికన్నా (ఐదు రూపాయలు) రెట్టింపు మాత్రమే చందా యిస్తున్నారు. మేం మాత్రం మూడురెట్లు సాహిత్యాన్ని యివ్వవలసివస్తున్నది కాగితం దొరకడం కష్టమైపోయింది. దొరికినా ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. ప్రింటింగ్ రేట్లు పెరిగిపోయాయి. మునుపటివలె నడిపినా ఎంతో వ్యత్యాసంపడే యీతరుణంలో మాసపత్రికను 80 పేజీలతో పదిరూపాయలకు పన్నెండు సంచికలు యివ్వడం ఎంత సాహసమో (ప్రకటనలుకూడదొరకని)సాహిత్య పత్రికల సంగతి తెలిసిన ఎవరైనా అర్థంచేసుకోగలరు.

మరోచెంపన, రచయితలనుంచికూడ సృజనకు ఆశించినంత సహాయ సహకారాలు లభించడంలేదు సృజన ఎంత గొప్ప రచయితకయినా, ఎంతగొప్ప రచనకయినా ఏమీ పారితోషికం యివ్వనిమాట నిజమే. కాని సృజనకు రాసే ఏ రచయితా అలాంటి పారితోషకాన్ని ఆశించి రాయరని, సృజనలాంటి సాహిత్య పత్రికలకు రాయడం తమవిధిగా కర్తవ్యంగా భావించి రాస్తారని మాకుతెలుసు. మరి ఎందువల్లనో ఒకవిధమైన నిర్లిప్తత, నిరాసక్తి రచయితలను ఆవరించాయని మాకు అనిపిస్తున్నది. ఇది మొదటిదానికన్న అవాంఛనీయమైన పరిణామం.

సృజన అభిమానులు యీ రెండురంగాల్లోనూ రెట్టింపుపూనిక వహించి సృజనను కాపాడుకుంటారని ఆశిస్తున్నాం.

— 'సాహితీ మిత్రులు'

# అలలు

అలలపైన నిషా !
అలలుకనే కలలపైన నిషా !
అలలపై అనురాగం చూయించే
చిరుగాలి సితారా సంగీతంపై నిషా !

అలలపై కదిలే
పడవలపై నిషా !
పడవల తెరచాపలపై నిషా
పడవల తెరచాపల తెల్లదనంపై నిషా !

ఉరి కంబాలపై అలలు !
కటకటాల వెనుక అలలు !
అలల కంఠంపై కత్తి !
అలల గాయాలనుండి కొన్నెత్తురు !
సముద్ర దొంగల గుజ్జపు డెక్కలకింద
అలల గాయాలనుండి కొన్నెత్తురు !

కత్తులతో సముద్రం గుండెల్లో
అక్కడక్కడా గుచ్చుతూ
పచ్చినెత్తురు తాగుతూ దొంగలు !
సముద్ర దొంగలు.
మట్టికాళ్ళ మహారాక్షసి
పుత్రులు
అన్నితీరాల్లో తిరుగాడే
దొంగలు !

అలలు ఏడ్చినవి
విశాల విషాద సముద్రము !

అలలు ప్రశ్నించినవి,
సముద్రమంతా హోరు !

అలల కదలినవి,
సముద్రమంతా పెనుగాలి!
అలల కొసల మంటలు
సముద్రంలో బడబాగ్ని
అలలు కదిలినవి
అలలు హోరెత్తినవి
అలలు వలయాలు పన్నినవి
తీరతీరాలు తాకినవి
ఏకాంత ద్వీపాంతరంలోని
మట్టికాళ్ళ మహారాక్షసిని కూల్చినవి.

అలల నెవ్వరడ్డగలరు?
కడలి నెవ్వడాపగలడు!

అలలు సముద్రం చేతికత్తి
అలలు సముద్రం చేతికలం

సముద్రం నిండా అలలు
అలలు! అలలు!!
నీలో, నాలో
అలలు
అలలుకన్నే
కలలు

అలలు పురిటినొప్పులు-
అలలు ఇప్పుడే
పుట్టిన బాలలు
సముద్రం పురిటినొప్పులుగా అలలు!
దరిద్రం రేపటికోసం కన్నకలలు.

— శివసాగర్.

## మాతృ ఘోష

బానిసత్వం జైళ్ళనుండి పరారీ అయిన వాళ్ళారా !
రండి నా కుటీరానికి
దాటలేని గోడల గూఢాచారాన్ని దాటిన వాళ్ళారా !
నా కుటీరానికే రండి.
ఇనుప సంకెళ్ళ సంప్రదాయాన్ని గండ్రగొడ్డళ్ళతో నరికిన వాళ్ళారా !
సెంట్రీ నిసిరాత్రి చట్టం పాముకన్నుల్లో పాపాన్ని పొడిచిన వాళ్ళారా !
ఎలక్ట్రిక్ ప్రహారీ అహంభావం బట్టతలను అరికాలితో మొత్తిన వాళ్ళారా !
ఒక్కరేమిటి ! జైళ్ళనుండి పరారీ అయిన సమస్తమైన వాళ్ళారా !
రండి నా కుటీరానికే రండి.

ఈ నా కుటీరంలో
మీ గాయాలకు బెంజీన్ !
నా కుటీరంలో
మీరుకోరే అరక్షణం విశ్రాంతికి
నా ఒడిలో వెచ్చని ఓదార్పు !
దూరపు కొండలనుండి దప్పికతోవచ్చే మీకు
నా స్తన్యం పొంగు !
పడగెత్తిన పాముపగతో పడిగాపులుపడే మీకు
నా బాహుబంధ రక్షణ !
జూలు విదల్చిన మీ కలతల సింహాలనూ
చింతలనూ చిరుతపులులనూ ఆకట్టి
మీ నుదుటిపై
నా చల్లని ముద్దు !

జైళ్ళనుండి బయళ్ళమీదకు పరారీ అయిన వాళ్ళారా !
రండర్రా రండి రండి :
రండి రండి రండర్రా !!
చీకటి దారుల్లో మీకోసం
నా నెత్తురు తైలంగా దీపాలు వెలిగించాను
మీకోసం, చలితో కొంకర్లుపోయిన వేళ్ళతో కంకర్లు తొలగించాను
చీకాకుల కీకారణ్యంలో విరిసిన విప్పపూలతో
మీకోసం ప్రతి అంగుళం అలంకరించాను
మీకోసం అడవి జింకపాలతో పాయసం చేసి ఉంచాను
అడవిలో చెట్టుచెట్టుకూ మీగురించి ముందే చెప్పి వుంచాను
మీకోసం నా దిక్కులేని ప్రేమను
ఉక్కు శిరస్త్రాణాల బారినుండి దాచి ఉంచాను
మీకోసం శిక్షాస్మృతిని శిక్షించాను
ఇక్ష్వాకుల వంశాన్ని రచ్చకీడ్చాను
దోపిడీ జైలుగోడల్ని బద్దలు గొట్టేందుకు
డైనమైట్లను
శతృవుల చక్రబంధాన్ని ఛేదించేందుకు
హేండ్ గ్రెనేడ్లను
నా గుండెల్లో కూర్చి ఉంచాను
బందూకులు భద్రంగానే దాచి ఉంచాను

రకరకాల జైళ్ళను బద్దలు కొట్టేందుకు
అన్యాయం జైళ్ళనుండి పరారీ అయిన వాళ్ళారా !
ఎక్కడికో పోకండి
జైళ్ళులేని లోకాన్ని శిల్పించేందుకు
జైళ్ళనుండి పరారీ అయిన వాళ్ళారా ! నా కన్నులారా !
తెలియని మోసపుతీరాలను చేరకండి

రండరా్రి రండి రండి
నా కుటీరానికే రండి
అధికార దర్పం సాగించే అజ్ఞానం కూంబింగ్‌ను దాటి
కిరాయి గూఢాచారుల విషదంష్ట్రిలను ఛేదించి
హెలికాప్టర్ల ఆకాశవాదాన్ని నేలకూల్చి
రండరా్రి రండి
కన్నీళ్ళింకిపోయిన కనులతో
ఇక మీకోసం విలపించలేను
రండరా్రి!
ఏ జామునైనా రండి
కుటీరం తలుపులు
అన్నిజాములా మీకోసం తెరిచి వుంచాను.

— పార్వతి.



త్యాగంచెయ్యండని ప్రజలకి బోధించడం వర్ధిదగా. సామాన్య ప్రజ త్యాగం చేయాల్సిందేముంది. ప్రాణాలు తప్ప! అందర్నీ త్యాగం చెయ్యమని "నాకాయుష్యం-నాకారోగ్యం" అనుకుంటూండే పెద్దల్నేగాక కిమ్మనకుండా సర్వం త్యాగంచేసేవాళ్ళనికూడా మనం చూస్తాం. ప్రజలకి తెలుసు ఎవరిననుసరించాలో.

— మాక్సిం గోర్కీ.

# తుది పయనం : తొలి విజయం

— శ్రీ శ్రీ

ఊగరా, ఊగరా, ఊగరా!
ఉరికొయ్య అందుకొని ఊగరా!
ఉరికొయ్య అంటుకొని ఊగరా!
ఉయ్యాలలాగ బాగా ఊగరా!
సోదరా, సోదరా, సోదరా!
చావన్నది నీకు లేనేలేదురా!
వీరుడా! ధీరుడా? శూరుడా! ॥ఊగరా॥

ఉక్కు మనిషివి నువ్వు, ఉగ్రనరసింహుడివి!
ఒక్కదెబ్బకు దిక్కుదిక్కులే పగిలించి,
అశ్వరథ శరభలూ, అట్టహాసాలతో
అడివి అడివంతాను పిడుగులే కురిశావు! అందుకే, ॥ఊగరా!॥

బరిసెలూ, కొడవళ్లే పాశుపతాస్త్రాలు,
గురితప్పనిది నీది శ్రీరామ బాణమే!
నీవిల్లు గాండీవం, నీయిల్లు భూలోకం!
నీగోళ్ళు గొడ్డళ్ళు, ఈ ప్రజలు నీవాళ్ళు! అందుకే ॥ఊగరా॥

ఎండనక, వాననక— తిండిసరిగ్గా తినక,
ఉన్నచోట ఉండకుండ ఊళ్ళెన్నో చుట్టేవు!
పగపట్టిన, పడగెత్తిన పాములాగ బుసకొట్టి
ప్రజావంచకాధములకు సమాధులే కట్టేవు అందుకే ॥ఊగరా॥

నువువేసిన కత్తిగంట్లు గంటల్లా మోగేయి!
నువువేసిన పొలికేకలు మంటల్లా రేగేయి!

బుద్ధితక్కువ గాడిదలకు పొటాసియం సైనైడువి।
అభిమానుల గుండెల్లో ఆరిపోని హైలైటువి।

తొత్తుకొడుకు లెవ్వరికీ దొరక్కుండ తిరిగేవు।
కత్తిదూసి కామాంధుల కుత్తుకలే తరిగేవు।
పేద ప్రజానీకానికి, పీడితులకు, తాడితులకు
చేదోడుగ, వాదోడుగ, నైదోడుగ మెలిగేవు
అందుకే ఊగరా, ఊగరా, ఊగరా!
ఎన్నటికీ ఆరనిదీ కాగడా!

పువ్వులాంటి యవ్వనాన్ని నిగ్గబట్టి నిలిచావు!
నిప్పులాంటి నిజాయితీ నెత్తికెత్తి నడిచావు!
కార్యదీక్ష కదిలిస్తే కదనానికి దూకేవు,
పద్మవ్యూహంలోని అభిమన్యుడి వైనావు। అందుకే ॥ఊగరా॥

నెత్తురు కార్చినకళ్ళే నిప్పులు చెరుగుతాయి!
వంకర టింకరరాళ్ళే గుళ్ళయి ఎగురుతాయి!
శ్రీకాకుళం అడవుల్లో చీమలు పాముని చంపుతాయి।
సింహాద్రి శిఖరంమీద చిలకలు పిల్లిని చెండుతాయి।

స్వాతంత్ర్యపు మారుపేరు సామ్యవాదమే, సత్యం।
చావులేని ఆ సత్యం జ్వలిస్తుంది అను నిత్యం।
సామ్యవాద రథసారథి మార్క్సుచూపెనదె తీరం।
తూర్పుదిక్కు మందారం, ఆర్పరాని అంగారం।
ఊగరా. ఊగరా, ఊగరా!
ఎన్నటికీ వాలనిదీ బావుటా!

మాంచాలను కొలుస్తారు, మల్లమ్మను తలుస్తారు,
ఝాన్సీలక్ష్మీబాయికి బాష్పధార విడుస్తారు,
సరోజినీదేవి ఫొటో పటంకట్టి పొగుడుతారు,
పంచాద్రి నిర్మలంటే భయంపుట్టి వణుకుతారు!

తెల్లవాడు నిన్ను నాడు భగత్సింగు అన్నాడు।
నల్లవాడు నువ్వు నేడు నక్సలైటు వన్నాడు।
ఎల్లవారు నిన్ను రేపు వేగుజుక్క అంటారు।
శివాజీకి వారసుడా। శ్రీశ్రీ కవిత్వలాలసుడా।
ఊగరా, ఊగరా, ఊగరా।
నువ్వూగుతుంటే శత్రువులకి గాభరా

నీ ధాటికి అడ్డులేదు, నీ త్యాగం వృథాకాదు।
నీ ఆదర్శం ఎపుడూ నీతోనే ఆగిపోదు।
ఇది ప్రపంచ పర్యాప్తం, జనశక్తికి పరమాప్తం।
ఈ పోరాటం అంతిమ విజయంతోనే సమాప్తం।

ఏ దేశంలోనైనా ఏకాకివి కావు నీవు।
వీర వియత్నాంలోన విజయగీతి పాడినావు।
అదిగదిగో, బాంగ్లాలో అగ్గివాన కురుస్తోంది।
ఇదిగిదుగో సిలోన్‌లోను ఎర్రసేన కదుల్తోంది।
ఇది ప్రపంచకుగ్రామం। ఇది గ్లోబల్ సంగ్రామం।
ఎటతెగనిది సంక్షోభం। ముందున్నతి సంక్షేమం।

ఉప్పెనలా ఉవ్వెత్తుగ యువకశక్తి లేచింది।
ప్రతినపట్టి, తొడలుకొట్టి, తిరుగుబాటు చేసింది।
హింసకు ప్రతిహింసతో ఎదురుదెబ్బ తీసింది।
పాపాత్ముల ప్రాణాలకు పరమాణువు బాంబులాగ
ఒక మాటగ, ఒకబాటగ, ఒకపాటగ సాగింది।
ఇంక్విలాబ్ ఇంక్విలాబ్ జిందాబాద్।
జిందాబాద్ జిందాబాద్ ఇంక్విలాబ్।
ఇంక్విలాబ్ జిందాబాద్।
ఇంక్విలాబ్ జిందాబాద్।
ఇంక్విలాబ్ జిందాబాద్।

# నా చెల్లీ! చెంద్రమ్మా!

రెంజిమ్

చెల్లెలా, చెల్లెలా! ఆహా, చెల్లెలా!/ఓహో! చెల్లెలా! ఓహోహో, చెల్లెలా!
నాచెల్లే చెంద్రిమ్మా! ఓ! పల్లె చెంద్రిమ్మా!/రేపల్లె చెంద్రిమ్మా!

కొండకు అవల కారడవి వున్నాది
కొండకు ఈవల ఏరొకటి వున్నాది
ఏరుకు పక్కాన పల్లొకటి వున్నాది
పల్లెలో వున్నాది చెల్లీ చెంద్రిమ్మా!

అల్లిపువ్వువంటి చెల్లీ నా చెంద్రిమ్మ
మొగిలిపువ్వు వంటి మరిదీరా మొగిలన్న
చూడచక్కని జోడు! బెమ్మా దేవునితోడు!
మంచి గోరింతాకు! చిగురుచింతాకు!

ఆ పల్లెలో వెలిశాడు వింతకాసిరెడ్డి
కాసిరెడ్డికి కలవు నూర్ల ఎకరాలు
కాసిరెడ్డికి కలవు బార్ల మేడల్లు
కాసిరెడ్డికి కలవు వేనూర్ల గోవుల్లు

కోరమీసము వాడు! కోడెనాగువాడు!
రాగిమీసము వాడు! రాకాసివాడు!
బట్టేబాజీవాడు! బట్టతలవాడు!
గొగ్గిపళ్ళవాడు! గుడ్డెలుగూవాడు!

వాడు ఉసిరిగ నీడల్లో పసిరిగ పామై
చెంద్రీమొగిలిల బతుకు కాటువేశాడ!

వాడు అంకారి బింకారి ఇంకారి తేలై
పల్లెపల్లెనంతా పోట్లుపొడిచాడ!

ఏమిచెప్పుదు గోడు! ఏమిచెప్పుదు కీడు!
ఆలుమందలు కాయ అవగింజ యిచ్చ
ఏమిచెప్పుదు గోడు! ఏమిచెప్పుదు కీడు!
నూతుల్లు తవ్వంగ నువ్వగింజ యిచ్చ
కాల్వలు తవ్వంగ కాశిగడ్డి యిచ్చ
దుక్కుల్లు దున్నంగ దుబ్బుగడ్డి యిచ్చ
పంట పండించంగ పరిగపంచి యిచ్చ

పెట్టుపోతలు లేవు! కత్తికోతలు వేలు!
వెట్టిచాకిరి కీడు! మట్టికలిపిన కూడు!
ఏకాదశీనాడు రాకాసివాడు
పిల్లగాలిమీద పికిలి కూసిందని!
జొన్నకంకి మీద చిలుక వాలిందని!
మొక్క పెరడులోన కుక్క మొరిగిందని!
వంక వంకలుపెట్టి, ముప్పతిప్పలుపెట్టి
మొగిలిని గుంజకుకట్టి, కొరడా చేతబట్టి
దెబ్బమీద దెబ్బ దెబ్బవిసిరాడు
వాడు కాసిరెడ్డికాదు రాకాసిరెడ్డి!

దెబ్బదెబ్బకు మొగిలి బొబ్బరించాడ
మొగిలి మేనంత నెత్తుర్లు కాల్వకట్టిందా!
దెబ్బదెబ్బకు మొగిలి బొబ్బరించాడ
పల్లెపల్లంత ఆపొద్దు తల్లడిల్లింద!

అడుగూలూ తడబడుతూ గూడుచేరె మొగిలి
నెత్తుర్లూ కారంగ గూడుచేరె మొగిలి

నెత్తుర్లూ కక్కుతూ గూడుచేరె మొగిలి
చావు వెంటరాగ గూడుచేరె మొగిలి

చెంద్రీ చెయిలోన చెయివేసి శెలవు అన్నాడు
చెంద్రీ వొడిలోన తలవుంచి తనువుచాలించాడు
చెంద్రీ కన్నుల్లో కనులుంచి కన్నుమూశాడు
చుక్క పొద్దువేళ చుక్కల్లో కలిశాడు

నాచెల్లీ శోకమ్మ ఏరులై పారిందా!
నాచెల్లీ శోకమ్మ వరదలై పొంగిందా!
నాచెల్లీ శోకమ్మ సంద్రమై లేచిందా!
నాచెల్లీ శోకమ్మ అకసము తాకిందా!

వగచి వగచి వగచి వొరిగిపోయింది—
కనలి కనలి కనలి కుమిలిపోయింది
మల్లె జిల్లేడాయె! తల్లడిల్లిన బతుకు!
వల్లకాదు మనసు! వల్లమాలిన దినుసు!

చెల్లేలా! చెల్లేలా! ఓహో! చెల్లేలా! ఆహా! చెల్లేలా! ఓహోహో! చెల్లేలా!
నా చెల్లే చెంద్రమ్మా! ఓ పల్లే చెంద్రమ్మా! రేపల్లే చెంద్రమ్మా!

ఎంతకాలము ఏడ్పు! ఎంత నిట్టూర్పు!
వగచి వగచి వగచి పగబట్టి లేచింది!
కనలి కనలి కనలి కసిపట్టి లేచింది!
నీలికన్నుల్లోన నిప్పుల్లురాల్చింది!
నీలికన్నుల నుండి కార్చిచ్చులేచింది!

చెంద్రీగుండె భుగభుగలాడి బాస చేసింది:

"ఓరీ! కాసిరెడ్డీ! ఇలలో బత్తెము దీరె!
ఓరీ! కాసిరెడ్డీ! నీకు భువిలో నూకలు చెల్లె!

ఓరీ! కాసిరెడ్డీ! నీ బిడ్డలకు నువు లేవు!
ఓరీ! కాసిరెడ్డీ! నా ఉసురు నీ ఉరితాడు!!"

ఆదివారమునాడు గోదారీనాడు
పొద్దుగుంకినవేళ, సద్దుమణిగినవేళ
పొలమో, స్థలమో చూచి తిరిగివచ్చేదొరకు
దారిలో చెంద్రిమ్మా తారసిల్లింది
పొలిమేరల్లో చెంద్రిమ్మా తారసిల్లింది,

చిటపట చిటపట చినుకులు చిట్లంగ
కాసిరెడ్డి వొళ్లు చిటపటాలాడె
పులపుల పులపుల చినుకులు చిందంగ
కాసిరెడ్డి వొళ్లు పులకరించంగ
జల్లు జల్లుమని వర్షమ్మా కురియంగ
కాసిరెడ్డి వొళ్లు జలదరించంగ

అంత వింత రెడ్డి వగలుపోయాడ:
"కందిరీగ నడుము వంటి నడుముదానా!
వాన జోరుహెచ్చె! గాలి హోరుహెచ్చె!
పసుల కొట్టము వద్ద మసలుకొందమురావె!
నీమొగుడు పోతేపాయె! నీవు దక్కవాయె!"

"జారుకొప్పుదానా! జాగిరీనడుముదానా!
వాన జోరుహెచ్చె! గాలి హోరుహెచ్చె!
నాఆశ కాపుకాసి నాదాపు వస్తివిగాదె!
రవరవ్వ గాలిసిరె రవ్వలేల మనకు?"

"ఓ!దొరా! ఓ!దొరా! వగలమారీదొరా!
నా ఆశ కాపుకాసే నీదాపు నేను వస్తి" అంటూ
ఎత్తిన కత్తి కుత్తుకలో దిగగుచ్చె
చెంద్రి కత్తి ఎత్తి వొత్తి పొత్తికడుపులోగుచ్చె

ఊరికి పులికాని గొడ్డలికి పులికాదు
దోపిడికి దొరకాని కత్తికి దొరకాదు
కత్తిపోటుకు రెడ్డి నెత్తుర్లు చిమ్మంగ
కత్తివేటుకు రెడ్డి నెత్తుర్లో దొర్లంగ.

చిందీన నెత్తుర్లూ చేతుల్లో తీసికొని
నుదుట బొట్టు పెట్టుకుందా చెంద్రిమ్మా
బొట్టు పెట్టుకోని చెల్లీ చెంద్రిమ్మా
చిటికలో చీకటిలో కలిసిపోయింద
చీమ చిటుకనగా చీకటిలో కరిగిపోయింద.

కారుమబ్బులొచ్చె, కటిక చీకటి కమ్మె
తెప్పమీద తెప్ప, తెప్పతోటి చినుకు
మినుకు నక్షత్రాల మిలమిలలు దిగమింగె

చీకట్లో చెంద్రిమ్మా ఏరుచేరంగ
మెరుపు మెరియంగ, ఉరుము పురమంగ
జాలారి జంగయ్య తెప్పకట్టంగ
వాన కురియంగ, ఏరుపారంగ
చీకటిపై, చినుకులపై తెప్పతేలంగ
చీకటితో చినుకులతో పోరుసేయంగ
పోరుసేయంగ, ఏరు దాటంగ.........
ఆవలి గట్టుమీద జాలారి జంగయ్య
'చెంద్రిమ్మ తల్లి'కి దండాలు పలుకు:

"నా చేతైన సాయమిదె చెంద్రిమ్మ తల్లీ
వెళ్లిరావేతల్లీ! మళ్లిరావమ్మా!
నాబిడ్డకు నీపేరు పెట్టుగుంటాను

వేయేండ్లు చల్లంగ వర్ధిల్లు తల్లీ!
వెళ్లిరావే తల్లీ! మళ్లి రావమ్మా!
అడవిలో అన్నలకు దండాలుసెప్పు
వెళ్లీరావే తల్లీ! మళ్లీరావమ్మా!"

ఝల్లు ఝల్లుమని తెల్లవారింది
ఎందుకో ఆపొద్దు తెల్లవారింది
గాలి వీచింది, గరికపూచింది
కోడెదూడ మెడలో గంటమోగింది
సారె తిరిగింది, కదురు కదిలింది
రావి చెట్టుకింద కొలిమి మండింది.
ఏటిపాట కొండసిగను చేరింది;
అడవిలో అన్నల్ల చెల్లి చేరింది

చెల్లేలా! చెల్లేలా! ఆహా! చెల్లేలా! ఓహో! చెల్లేలా! ఓహోహో! చెల్లేలా!
నా చెల్లే చెంద్రిమ్మా! ఓ! పల్లే చెంద్రిమ్మా! రేపల్లే చెంద్రిమ్మా!

వాడవాడల నున్న కోడెనాగుల పీడ
విరగడయ్యే విధము విశదమ్ము చేసిన
నాచెల్లీ చెంద్రీమాట కలకాలముండు
నాచెల్లీ చెంద్రీపాట చిరకాలముండు

[అంకితం:
చీకటిలో చినుకుల్లో
ఏరు దాటేందుకు
నారి మీటేందుకు
సాహసిస్తున్న నా చెల్లెళ్లకు]

## ఊదు.... ఊదు.... ఊదు

—సత్తెయ్య

ఊదు...ఊదు...ఊదు
నిప్పు నూదు వూదు
మంటసెయ్, కాలిసెయ్
సీకటుండ బోదు।

గుండె లంటుకోనీ
కన్నీల్లు పేలిపోనీ
పేదరికం మల్లబడితే
పెద్దరికం బతకదు।

కొలుముల్నీ మండనీ
కొడవల్లూ కాలనీ
పనిముట్లే పగబడితే
దోపిడీ సాగదు।

కొండలు ఎరుపెక్కనీ
అడవి నిప్పు కక్కనీ
పల్లె, పట్న మంటుకొంటె
అపజయమే వుండదు।

నిప్పులోన యేడుంది
నిప్పులోన యెల్తురూ
నిప్పులాంటి బతుకులోన
నిస్సత్తువ వుండదు।

ఊదు...ఊదు...ఊదు
నిప్పు నూదు వూదు
మంటసెయ్, కాలిసెయ్
సీకటుండ బోదు।

# వెలుగు నిలుపుకోవాలి

—వినయకుమార్

కట్టెలెగదోసినప్పుడల్లా
చిట్లుకుంటూ మంటలు
మింటి కెగుస్తాయి
మంట ఆరిపోదు.

నీవు ఎగదోయడంలో
చూపిన ఆలస్యంవల్ల
నీ అజాగ్రితవల్ల
నీ జాప్యంవల్ల
బూడిద కప్పుకొని
లోలో రగిలేస్థితి ఏర్పడింది.

ఎంతో కాలం బూడిద గుండెలో
రగులుతూ బతకలేదు
ఈ చలినీ, చెదలునూ
తగలపెట్టడానికి
నీవూ, నేనూ కట్టెలెగదోయాలి

నిప్పు చల్లారలేదు
చల్లారిపోతున్నది నీవూ, నేనూ.

# గొప్పోళ్ళ రాజ్యం

మరువాడ రాజేశ్వరరావు

ఫేక్టరీ సైరను ఊదగానే జనం బిలబిలా పైకొచ్చి హాయిగా ఊపిరి పీల్చుకుంటున్నారు.

ఒకర్నొకరు తోసుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ ఉషారుగా కొందరు నడుస్తున్నారు. రాములు నీరసంగా నడుస్తున్నాడు. అతని మొహం విచారంగా ఉంది. కళ్ళల్లో ఏదో బాధ....

"ఏం ఎలాగున్నావు, రాములూ?" అన్నాడు వీరయ్య, అతని భుజంమీద చెయ్యివేస్తూ.

"రంగికి జబ్బుచేసింది క్షయరోగం వంట! ... సచ్చిపోద్దేమో?...."

అతని గొంతులో భయం.

రాములుకీ, వీరయ్యకీ మంచి స్నేహం.

వీరయ్య చదవగలడు. కొన్ని తెలుగు పుస్తకాలు చదివేడు. రోజూ న్యూస్ పేపరు చదువుతాడు. మంచి ఆలోచన, తెలివితేటలు ఉన్నాయి. తనకి తెలిసిన విషయాలన్నీ రాములుకీ, తోటివర్కర్లకీ చెప్తాడు. అందుచేత అతనంటే వాళ్ళందరికి గౌరవం ఉంది.

ఆ రోగం వొచ్చిన వాళ్ళందరూ చచ్చిపోరని రాములుకి ధైర్యం చెప్పేడు. వైద్యశాస్త్రం బాగా పెరిగిందన్నాడు. ఎలాంటి రోగాలకీ మందులు కనిపెట్టేస్తున్నారన్నాడు. అని, ఒక్కసారి చికాకుపడ్డాడు

"యేట్నాటం రాములూ? ఏఏ శాస్త్రాలెంతెంత పెరిగినా, కష్టపడేవోడికెందుకూ పనికిరావు. మనంపడే కష్టంకొద్దీ జబ్బులొస్తాయి రాములూ! కష్టంకొద్దే దరిద్రమూనూ. ఇది గొప్పోళ్ళ రాజ్యం రాములూ. నీలాంటి నాలాంటి పేదోడికి రోగాలూ, చావులూ వేగొస్తాయి. రోగం, చావూ వొస్తే నీకూ నాకూ దిక్కులేదు. ఆ మద్ది వెంకన్నపంతులుగారి మనవడికీ ఇదే జబ్బుచేసింది. ఎందుకు చేసిందనడుగు.

సిగరెట్లు తాగేవోట్ట. సీసాలకొద్దీ సారా తాగేసేవోట్ట. మరి నీరంగి కెందుకొచ్చింది? తిండిలేనందు కొచ్చింది. పోనీ, లేదన్ను. ఆ ఉన్నతిండి అడిపడిన కష్టానికి సాల్లేదు. నీర్సంమీదొచ్చింది. ఆర్నెల్లు రెస్టూ. ఆరారా తిండీపడేసనికి.... ఆ యెంకన్న పంతులు గోరి మనపడిప్పు డెలాగున్నాడో నీకు తెల్దికాదు రంగికేపెడతావ్? బోల్డు డబ్బు ఖర్చౌతుంది రాఁవులూ. ఎక్కడ్నించి తెస్తావు?"

"కష్టపడతాను" అన్నాడు రాఁవులు బింకంగా.

"అవును మరి, యిన్నాళ్ళూ కాలుమీద కాలేసుక్కూర్చున్నావు కదా. ఇకమీద కష్టపడతావు?"

ఆ అనడంలో హేళనేకాదు. కొంచెం బాధకూడా ఉంది.

పొద్దున్న ఎనిమిది నించీ, సాయంత్రం అయిదు గంటల్దాకా ఎంత ఎక్కువ పని పిండడం సాధ్యమో, అంతా పిండుతారు ఫేక్టరీవాళ్లు. పనివాడు చావకుండా, బతక్కుండా ఉండడాని కెంత జీతం ఇవ్వాలో అంతే ఇస్తారు. బతకడానికి పనిచేద్దామని అందులోకి వెళ్ళిన ప్రతివాడూ, పని చెయ్యడానికే బతుకుతూ ఉంటాడు.

రాఁవులింకా ఎంత కష్టపడగలడో వీరయ్యకి బోధపడలేదు. రాఁవులుకీ బోధపడలేదు. అయినా, ఏదో ఒకటిచేసి రంగిని కాపాడుకోవాలని ఉందతనికి.

రంగి అతని జీవితం

ఎవరేనా, ఏదో 'ఆశ' ఉంటేనే కష్టాలు భరిస్తారు.... రంగి అతని ఆశ; రంగిని చూస్తున్నంత సేపూ, ఈకష్టాలు రేపుకాకపోతే మరోరోజుకేనా పోతాయనిపిస్తుందతనికి.

రంగిని బతికించుకోడానికి ఏం చెయ్యడానికేనా అతను సిద్ధమే.

* * *

నాలుగు రోజుల తరవాత ...

రాత్రి ఎనిమిది దాటేక. 'రాఁవులూ' అంటూ వచ్చేడు వీరయ్య.

గంజి తాగి, చెయ్యి కడుక్కుని వీధిలోకొచ్చేడు రాఁవులు.

"సుబ్బరాజు గారింట్లో ఆళ్ళ పాప నాడించనందికీ, మొక్కలకి నీళ్లెయ్యడానికీ, అప్పుడప్పుడు గొప్పులయీ తవ్వడానికీ మనిషికావాల్ట, చేసుకుంటావా?"

"అక్కడెవుడో పనిచేస్తున్నాడు గా(వాల?"

"ఆ గుంటడ్ని మానిపించినారు, ముందు పర్మిసనడక్కుండా రెండ్రోజులు సెలవుపెట్టేసేడు. పాప(వేదో ఏక్సిడెంటైందంట... అళ్ళకేటి, అళ్ళమాటే సెల్లుబడై పోవాలి. ఆయమ్మ కోక్కపంపొస్తే తిరుగుండదు... పోన్లే, నువ్వుచేసోక్క. నీ అవ సం(వూ తీరుతుంది ......"

సుబ్బరాజు పెద్ద కంట్రాక్టరు. కొన్ని కంపెనీల్లో షేర్లు, ఒకటి రెండు ఫేక్టరీల్లో వాటాలు, అద్దెలకి నాలుగైదు ఇళ్ళు, ముప్పై నలభై ఎకరాల ఇళ్ళ స్థలాలు, చిన్నచిన్న వ్యాపారాలు కూడా ఉన్నాయి. ఆయనకో 'ముద్దొచ్చే' భార్య, ఆమెవల్ల ఓ ముద్దుల కూతురు ఉన్నారు. కూతురికి అయిదేళ్లుంటాయి.

వాళ్ల 'స్టేటస్'కి తగ్గట్టు తరుచుగా సాయంత్రం పూట పార్టీలు, కచేరీలు, మీటింగులు, ఫంక్షన్‌లు, సినిమాలు, — అలాంటి ఎంగేజ్‌మెంట్సు చాలా ఉంటాయి. అన్నిటికీ పాపని తీసుకెళ్ళడం పడదు.

మర్నాటినించీ పనిలోచేరి పోయేడు రా(వులు. అడబ్బు రంగి వైద్యానికే ఖర్చు పెట్టాలనుకున్నాడు రా(వులు.

ఎంత డబ్బో?....

నలభై రూపాయలు!

* * *

దూరాన్నించి చూస్తే దీపాలతో భగ్గున మండిపోతున్నట్టుందా మేడ. దగ్గిరగా వెళ్తే మేడలో ఉరుకులు, పరుగులు.... పైకి, కిందికి....

'పేణీళ్ళు?'

"ఫేను కొంచెం తగ్గించండర్రా...."

"డాక్టర్!... డాక్టర్!....

"ఎవర్రా అక్కడ? రా(వులూ!.... వేగంవెళ్ళి, ఈమందులు కొనుక్కురా.... వెంటనే రావాలి....".

అరుపులు.... కేకలు... ఆందోళన

సుబ్బరాజుగారి ఒక్కగా నొక్కకూతురికి సాయంత్రం ఏదో జ్వరం వచ్చింది. రాత్రయేసరికి ఎక్కువైంది. పనిపూర్తిచేసుకొని ఇంటికి పోబోతున్న రాంవులు చేత డాక్టర్ని పిలిపించేరు. అప్పుడొచ్చిన డాక్టరు అర్ధరాత్రయేదాకా కదల్లేదు.

దూరంగా చర్చిలో రాత్రి రెండు గంటలు కొట్టిన కొంతసేపటికి....

డాక్టర్ మొహాన చిరునవ్వు.... ఇంటిల్లిపాదికీ సంతోషం

"షి విల్ బి ఆల్‌రైట్".

తేనెజల్లు లాంటి మాటలు.... డాక్టర్ ప్రసాదరావు మాటలు చాలామందికి అంతే। ఆయన చేతి చలవగొప్పది.

వాడవలసిన మందుల లిస్టు,

'డైయట్'— ఏది తినిపించాలో, ఎంత తినిపించాలో, ఏది తినిపించకూడదో ....అదోలిస్టు!

సుబ్బరాజు భార్య ఇంగ్లీషులోనూ తెలుగులోనూ కూడా నాలుగైదుసార్లు కృతజ్ఞతలు చెప్పుకుంది.

"అబ్బే ... ఇది నా డ్యూటీ" అని నాలుగైదుసార్లన్నాడు డాక్టరు.

డాక్టరు కార్లో కూర్చున్నాక ఆయన బేగ్ భద్రంగా కార్లోకి చేర్చేడు రాంవులు. కారు వెళ్ళిపోయింది.

ఈయనోసారి రంగినికూడా చూస్తే బాగుండు ననిపించింది రాంవులుకి. సుబ్బరాజు భార్యకన్నా ఎక్కువగానే కృతజ్ఞత చూపించగలడు.... జీవితాంతం ఆయనపేరు చెప్పుకుని....

కాని, డాక్టరు 'డ్యూటీ'కి డబ్బుతో ముడిపడింది. అది కొనుక్కునే తాహతు రాంవులుకి లేదు.

తెలతెలవారుతుండగా ఇంటికి బైర్దేరేడు రాంవులు.

నిద్రలేక ఎర్రబడ్డ కళ్లు,

నిద్రిలేని నరాల అలసటతో తడబడే అడుగులు....

ఎనిమిదో గంటకి ఫేక్టరీలో ఉండాలి.

నడక జోరు హెచ్చింది.

గుడిసెల ఇరుకు సందుల్లోంచి నడుస్తూ..... ఒక సందులో, ఒక గుడిసెలోకి వంగి దూరేడు.

ఎదురుగా, ఆందోళనతో రెప్పపడని చూపులు ... రంగి రాత్రి నిద్రపోయి నట్టులేదు.

"అమ్మాయిగోరికి శానా జబ్బు సేసీసింది. ఎవులికీ కంట్లో కునుకునేదు.... రాత్రికి నన్నుండిపోమన్నారు. పెద్దోరు.... కాదంటే బాగోదని, ఉండిపోనాను...." అంటూ, రంగి పక్కనే నులకమంచం మీద కూర్చుని. వీపు నిమురుతూ,

"ఎలాగుంది రంగీ ?" అన్నాడు.

రంగి మాటాళ్ళేదు. అతనివంకే కళ్లప్పగించి చూస్తోంది. అయాసపడుతూ, అప్పుడప్పుడు సన్నగా మూలుగుతూ.... చూస్తోంది !

ఆ చూపుల్లో రోజురోజుకీ దగ్గరవుతున్న చావు— నిరాశ !

బైటికెళ్ళి చన్నీళ్ల స్నానం చేసేడు రాఁవులు. ఫేక్టరీకి వెళ్ళేముందు రంగికి మందువేసి. ఎనిమిదేళ్ళ పెద్దకూతుర్ని నిద్రలేపి,

"అమ్మని, తమ్ముళ్ళని సూస్కో ?" అనిచెప్పి వెళ్ళిపోయేడు, పక్క సందులో కలిసిన వీరయ్యతో కష్టసుఖాలు చెప్పుకుంటూ.

"గొప్పోళ్ళకి రోగాలొస్తాయా అని చూస్తూ ఉంటారు డాక్టర్లు, మందులషాపోళ్ళూనూ ! రోగఁవొచ్చినా, రొష్టొచ్చినా, పండగొచ్చినా, పెళ్ళొచ్చినా ఆళ్ళకి బాగానే జరుగుద్ది ... మరి నువ్వూ ఉన్నావుకదా. రెక్కలు ముక్కలు చేసుకుంటున్నా, నీ పెళ్లానికి మందులకొంటే తిండుండదు. తిండుంటే మందులుండవు...." అన్నాడు వీరయ్య.

"పోరా. గొప్పోళ్ళంటే నాకుమరీ మంటెక్కువ ... రోగఁవొస్తే. గొప్పైనా పేదైనా వొకటే కదా... అంత ముద్దొచ్చేపిల్ల— బతక్కూడదని మనఁ వనుకుంటాఁవా ? మనకి జరగలేద నేడవాలిగాని. ఆళ్ళకి జరిగింద నేడుస్తాఁవా ?" అన్నాడు రాఁవులు.

వాళ్ళిద్దరికీ అదే తేడా !

ఇది గొప్పోళ్ళ రాజ్యఁవంటాడు వీరయ్య.

అదెలాగో ఎఁతకీ అర్థంకాదు రాఁవులికి. గాంధీబాబు, నెహ్రూబాబు తెచ్చిన సొరాజ్జెఁపన్నా, వోట్లడుక్కునీ కాంగ్రెసోళ్ళ రాజ్జెఁవన్నా— అంతా 'మన' రాజ్యఁవేనని అతని అభిప్రాయం. పాకీస్తానుతో యుద్ధం వొచ్చినప్పుడు దేశభక్తికొద్దీ అయిదు రూపాయ లిచ్చేడుకూడా.

రంగి రోజురోజుకీ హరించుకుపోతోంది అదిచూసి బాధపడడాని కూడా తీరిక లేనంత పనివొత్తిడిలో పడిపోయేడు రాఁవులు.

ఓ సాయంత్రిం ...

సుబ్బరాజు, భార్య— ఎవరింటికో డిన్నర్‌కి వెళ్ళేరు. ఇల్లు జాగ్రిత్తగా చూసుకోమని, పిల్లని ఆడించమని, వెయ్యి జాగ్రిత్తలు చెప్పి, చేతికి పాలసీసా, కొన్ని ఆటబొమ్మలు యిచ్చి, అంతగా అవసరమైతే ఫలానా నెంబరుకి పక్కింటినించి ఫోన్ చెయ్యమని చెప్పి, వెళ్ళిపోయిందావిడ.

రాత్రి ఏడున్నరదాటి ఎనిమిది దగ్గరవుతోంది. కథలుచెప్తూ, పాపని నవ్విస్తు న్నాడు రాఁవులు.

ఇంతలో,—

"ఓ ...రి రాఁవులో. రంగి సచ్చిపోనాదిరో బాబూ ..." అని అరుస్తూ, ఏడుస్తూ పరుగున వచ్చిందో ముసిలమ్మ

రాఁవులుకి ఒక్కక్షణం ఏమీ తోచలేదు.

"రంగి సచ్చిపోనాదిరో" ...

రెంపకాయ తగిలినట్టు నిజం అర్థఁవైపోయిందతనికి. పాపని భుజంమీద వేసుకుని, పెద్దపెద్ద అంగలేసుకుంటూ ఇంటివేపు పరిగెత్తేడు.

రాళ్లు తన్నుకుంటూ, గతుకుల్లో తూలిపడబోతూ, దారిలో మనుషుల్ని తోసుకుంటూ. గాభరాగా పరిగెత్తేడు వొంట్లో రక్తంకూడా అలాగే పరిగెడుతోంది. నరాలు వొణుకుతున్నాయి. పెదిమలు అదురుతున్నాయి.... గుడిసె ముందున్న పదిహేను, పాతికమంది జనంలోంచి గుడిసెలోకి దూరేడు.

లోతుకిపోయిన కళ్ళు భయంకరంగా తెరుచుకున్నాయి. ఏదో అనబోతున్నట్టు నోరు తెరుచుకుని ఉండిపోయింది.

చేతిలో ఉన్న పిల్లని మెల్లిగా కిందికి జార్చేస్తూ, శవంవేపు వెర్రిగా చూసేడు రాఁవులు. శవం చేతిని తనచేతుల్లోకి తీసుకుని, 'రంగీ' అన్నాడు. ....గుండెలోతుల్లోఁచి వచ్చిన సన్నని ధ్వని। రంగి పలకలేదు.

సుబ్బరాజు పాప, ఆ గుడ్డిలైటు వెలుగులో కళ్ళుపెద్దవి చేసుకుని చుట్టూ చూసింది. అటువంటి స్థలాన్ని, మనుషుల్ని ఇదివరకెప్పుడూ చూడలేదా పాప

గుడ్డి వెలుగులో మట్టినేలమీద.... కొమ్మల గుడిసెల్లో... బట్టలే లేనట్టున్న మనుషులు మట్టివాసనవేసే జిడ్డుమొహాలు దుఃఖం, విచారం.

ఇవన్నీ ఇన్నాళ్ళూ ఆ పాపకి తెలీవు. తనని రోజూ ఎత్తుకుని ఆడించే, నవ్వి, నవ్వించే రాఁవులుని అంత దీనత్వంలో ఎప్పుడూ చూడలేదా పాప.

చూసిన తరవాత గాభరాపడి 'కేర్' మని ఏడిచింది— వాళ్ళందరి కోసఁవూ ఏడుస్తుందో, రాఁవులు దీనత్వానికి బాధపడే ఏడుస్తోందో, భయంకొద్దీ ఏడుస్తోందో...

ఏడుస్తున్న పాపని బైటికి తీసుకుపోయేడు వీరయ్య

పాపని తీసుకొచ్చిన వీరయ్యని చూస్తూ.

"ఆదొంగ రాస్కెల్‌ని రమ్మను. వాడిపనిచెప్తాను. మా బేబీని ఆ మురికివెధవ పేటలోకి తీసుకెళ్తాడా। వాడి చర్మం వొలిపించేస్తాను .." మండిపడ్డాడు సుబ్బరాజు.

అంతటి మనిషికీ, వీరయ్య చూసిన, 'చూపు' చూస్తూనే రక్తం గడ్డకట్టినట్టై పోయింది.

మరోమాట మాట్లాడకుండా, చరచరా నడిచి వెళ్ళిపోయేడు వీరయ్య.

* * *

వీరయ్య వెళ్ళిపోయేడు.

'గొప్పోళ్ళ రాజ్యం మీద యుద్ధం చేసి, పేదోళ్లరాజ్యం తెస్తానం'టూ వెళ్లి పోయేడు

వెళ్ళేముందు...

విచారంతో, కాళ్ళూ చేతులూ ఆడక చతికిల పడిపోయిన రాంవులుని చూసి అతనన్న మాటలు...

"రాంవులూ! నువ్వు రాత్రీ పగలూ కష్టపడి నీపెళ్ళాన్ని బతికించుకోవాలనుకున్నావు. నువ్వు తిండిమానేసి నీ పెళ్లాన్ని బతికించుకోవాలనుకున్నావు. కాని, రాంవులూ! నీ ఆకలి మరో గొప్పోడ్ని పెంచడానికేగాని, నిన్నూ, నీ పెళ్లాన్నీ, నీ పిల్లల్నీ బతికించుకోడానిక్కాదు. నీ కష్టంవంతా ఇంకోడు భోంచేసేదేకాని నీవాళ్లని నీకు దక్కించేదికాదు. ఎంత కష్టపడినా, ఎన్ని దేవుళ్ళకి మొక్కుకున్నా మన దరిద్రం తీరేదికాదు. నిన్న నీపెళ్ళం రోగంతోచచ్చింది. ఇన్నాళ్ళూ అకలికి మాడిమాడి నువ్వు మాత్రిం బాగున్నావా? నీకూ, రేపోమాపో ఏదో పెద్దరోగంవే వొస్తుంది. నీ పిల్లలు ఆకలికి మాడి మాడి శవాల్లాగ బతుకుతారు. నీపిల్లల పిల్లలు ఆ పిల్లలపిల్లలు .. రాంవులూ! కష్టపడే వాళ్ళజాతి జాతంతా ఇలాగే రోగాల్తోనూ, ఆకలితోనూ చావక తప్పదు. నీ తాతలూ, తాతల తాతలూ ఇలాగె చచ్చేరాంవులూ! నీ పిల్లల గతీ అంతే .. కాదు రాంవులూ! ఇలా జరగడానికి వీల్లేదు. మనం ఇన్నాళ్ళూ ఊరుకున్న పాపానికి శిక్ష ఈ గొప్పోళ్ళ రాజ్యంలో ఇన్నాళ్ళూ అనుభవించేం రాంవులూ. ఇంక ఆ పాపం మరి చెయ్యొద్దు. ఇంకా శిక్షలు అనుభవించొద్దు. మన చెమటతో, రక్తంతో మన శవాలమీద గొప్పోడు మనచేతే కట్టించుకున్న మన రాజ్యాన్ని మనం గెల్చుకుందాం రాంవులూ... మన పిల్లలకోసం, మనపిల్లల పిల్లలకోసం యుద్ధం చేద్దాం రాంవులూ బతకమను గొప్పోడ్నీ బతకమను. ఆడూ మనిషే. మరి మనిషిలాగ బతకమను? మన శవాలమీద కాదు, మనతోకలిసి బతకమను? మనరక్తం తాగికాదు మనతో రక్తం పంచుకు బతకమను. మన కష్టం భోంచేసికాదు. మనతో కష్టాన్నీ, తిండినీ పంచుకు బతకమను? మన్నిచంపి ఆడు బతుకుతానంటాడా? కాదు, ఆడ్ని చంపే మనం బతుకుతాం. నేనెళ్తున్నాను రాంవులూ. యుద్ధానికెళ్తున్నాను .. వెళ్తున్నా రాంవులూ... తప్పకుండెళ్తాను..."

ఆ మాట్లాడింది వీరయ్యకాదు. అతని గుండెల్లో రగుల్తున్న మంట...

అతను మాట్లాడేక రాంవులేమీ అనలేదు. ఎర్రబడ్డ కళ్ళతో చీకటిని చీలుస్తూ ఎటో చూస్తున్నాడు దుఃఖం, విచారం కొంత తగ్గేయి... వీరయ్య మాటలు కొద్ది

కొద్దిగా తలకెక్కుతున్నాయి. ఆ పరధ్యానంలో వీరయ్య ఎప్పుడెళ్లిపోయిందీ గమనించలేదు.

రంగి... చావు... ఆశ : చచ్చిపోయింది.

'పిల్లలు .. పిల్లల పిల్లలు... గొప్పోళ్ళ రాజ్యం .. యుద్ధం... యుద్ధం .. యుద్ధం...'

ఆ మాటలు అతని బుర్రలో గింగురుమంటున్నాయి. ఈ యుద్ధానికి అయిదు రూపాయలు కాదు... తన ప్రాణాలే ఇచ్చేయాలనిపిస్తోం దతనికి. అమ్మ లేనందుకు దీనంగా చూస్తూ కూర్చున్న పిల్లల్ని చూసినప్పుడు... అతని పట్టుదల మరింత ఎక్కువయింది.



ఓరిమి, ఓరిమి గొడిదల సుగుణం. ఇతరులుపెట్టే బాధలకి లొంగి సహించి, ఓరిమితో పడివుండడం, మానవుడ్ని దహించేస్తుంది. ఓరిమి నిప్పులా ఆశ్రియమిచ్చినవాళ్ళను దహించేస్తుంది, ఓరిమికలిగి వుండండనే వాళ్లు ప్రజల్ని కన్నుగప్పి గాడిదలుగా చేద్దామని చూస్తున్నారన్నమాట,

— మాక్సింగోర్కీ

# శలభాలు

'సికె'

''రెడ్డి లేకపోవటంచేత ఆట రమ్యంగా సాగటంలేదు ఇవ్వాళ'', అన్నారు రావుగారు, కాఫీకప్పు పెదవికి చేరుస్తూ.

''నిజం, నిజం...'' అన్నాయి పక్క తాళాలు, ఖాళీకప్పులు క్రింద పెడ్తూ .. మళ్ళీ అంతా పరీక్షకు చదువుతున్న కుర్రాళ్ళలా పేకముక్కల్లో మునిగిపోయారు.

అది రావుగారి మేడ. పెద్ద స్థేకుతో పేకాదేవారికి చక్కని నీడ. దర్జాకు తగ్గట్టుగా రావుగారి అతిథి (?) మర్యాదల్లో ఏ లోపంరాదు దర్జాకు, హోదాకు అయన్నే చెప్పుకోవాలి. ఆ అందమైన మేడలో... బూరుగుదూది పరుపుల మీద హాయిగా కూర్చుని, సిగరెట్లు—కాఫీలు చకచకా అందుతూవుంటే— అదీ బయటవర్షం పడుతూవుంటేనో, చలిచలిగా వుంటేనో- పేక ఆడటంలో వున్నమజా వారికేతెలుసు.

ఈ రోజువున్న లోటంతా రెడ్డిబాబు లేకపోవటమే... వారి ఛలోక్తులు .. ఆ ఆనందానికి తాలింపురుచి తెచ్చిపెడ్తాయి. అమాటే తల్చుకున్నారు, రావుగారు.

"దొరా! దొరా!!"— కొంపలంటుకు పోతున్నట్టున్న పిలుపువిని గబగబా మేడ దిగివచ్చారు రావుగారు.

పాలేరు రాముడు వగరుస్తూ ''దొరా, రెడ్డిబాబు [1]దూరంత దున్నిపిచ్చిండు. మన చేండ్లకల్లి ఆల్లకు జాగారావాల్నట .. అదికూడ దున్నిపిస్తడట— లొల్లిలొల్లిగా ఉన్నది!" అని చెప్పాడు.

రావుగారి మొహం రక్తంతో నిండింది. కళ్ళు చంద్రనిప్పుల్లా మండాయి. ..ఉగ్రనరసింహావతార మెత్తారు.

''ఎవడ్రా— ఎవడి కంతధైర్యం?'' — అరిచారు రావుగారు.

---

1. దూర = రెండు చేలకు హద్దులు నిర్ణయించే గట్టు.

"రెడ్డిబాబు స్వయాన పక్కనుండి దున్నిపిస్తాండు, దొరా!"

"హుం–మేడిపండు ముండాకొడుకు నా మోచేతినీళ్ళు తాగి నాకే ఎసరుపెడ్తాడా–? సరే– నేను వస్తున్నాను... బండికట్టు..." రావుగారు మిత్ర బృందానికి త్వరలో వస్తానని, ఆట సాగించవలసిందనీ చెప్పి బయల్దేరారు.

ఎద్దులు గలగలగల గజ్జెల చప్పుడుచేస్తూ పరుగులుతీసాయి ప్రక్కన రాముడు పోటీ వేసుకున్నట్టు పరుగులతో వస్తున్నాడు

రావుగారక్కడికి చేరగానే చూసినదృశ్యం— [2]ఆవారీ భీమన్న కర్రతిప్పుతూ "రండ్రా, నా మాదిక్కొడుకులారా! .. రండ్రా . ఇంకోడన్తరో రండ్రా .. నా భూమిలకి కాలుపెట్టి దున్నుతార్రా మీరు .. ఇరవై ఏండ్లనుంచి నెత్తురువోసి పండిస్తున్న ఇయ్యాలొచ్చి నా భూమిల కాలుపెడ్తార్రా .. ఇది నాతల్లిరా .. నా తల్లిమీద చేయివేసినోడి నెత్తురుతాగక యిడిసిపెడ్తాన్రా!" అంటూ అరుస్తున్నాడు.

ప్రక్కనే బుర్రపగిలి, రెడ్డిబాబు పాలేరు 'రంగడు' రక్తం మడుగులోవున్నాడు. అంతా అర్థం చేసుకున్నారు రావుగారు.

రావుగార్ని చూడగానే రెడ్డిబాబు పక్కచేనులోంచి వచ్చి, రావుగారికి వినయంగా నమస్కరించాడు. రావుగారి మనస్సు చిటపటలాడింది. "చేసింది చాలక... మర్యాదలు కూడానా? అనాడు .. ఏదో మనవాడేగదా. అన్యాయం జరిగేది మనక్కాదుగదా అని పూరుకుంటే దొరికిన చేను. అది మెచ్చిపోయి... తిన్నయింటి......"

"దొరగారు తప్పర్థం చేసుకున్నారు. ఇది పాలేర్ల మధ్యవచ్చిన అపార్థంవల్ల జరిగిన అనర్థం! ఇందులో నాచెయ్యి ఏమీలేదు .. అంతకన్న చావేమేలు. ముందు జరగవల్సింది దొరగారు చూడాలి." రెడ్డిగారు మంచుగడ్డకంటే చల్లగా మాట్లాడతారు. రావుగారు చల్లారారు. జరగవల్సింది వారు చూస్తూండగానే జరిగిపోయింది .. పంచనామా జరిగింది... భీముని చేతులకు బేడీలుపడ్డాయి.

సాయంత్రం రావుగారి ఇంటివద్ద భీముని భార్య ఆక్రందనలకు దొరికిన జవాబు. "నేను చెయ్యవలసినంత చేస్తాను. ఆపైన భగవంతునిదే భారము! భీముడికి శిక్ష

2. ఆవారీ = పాలేర్లలో ఒకడ్ని ఎన్నికచేసి– సుపర్విజన్ అప్పగిస్తారు. అతన్ని ఆవారీఅని పిలుస్తారు.

తప్పటం కష్టమే... అయినా వాడ్నసలు ఎవరు హత్యలు చేయమన్నారు? వాడికొంపే మునిగినట్టు ఏమిటా గందరగోళము!! ఏదో మాలోమేము చూసుకునేవాళ్లం .. తేలుకు పెత్తనమిస్తే తెల్లవార్లూ తెగకుట్టిందట!....."

అదే సాయంత్రం— రంగడి భార్య రెడ్డిబాబు ఇంట్లో గుండెలు బాదుకుంటే దొరికిన జవాబు— "నన్నేం చేయమంటావు, చెప్పు! భీము దిలా చేస్తాడని కల గన్నానా? నీవెంతఏడ్చినా చచ్చినవాడెటూ తిరిగిరాడు... నీబ్రితుకంతా ముందేవుంది.. నీ రెక్కలున్నంతసేపు డొక్కాడదనే భయమెక్కడ?......"

మర్నాడుదయం మహల్‌లో మహిఫిల్ వెలిసింది. ఆట జోరుగా, వయసొచ్చిన పిల్లతో షికారుగా నడుస్తోంది. సిగరెట్టు నుసిదులుపుతూ రావుగారు అన్నారు. "చూడండి మరి. రెడ్డివున్నాడు... ఆట రమ్యంగా సాగుతోంది..."

"అవునవును," అన్నాయి పక్కతాళాలు తళాంగిత తకిధిన్‌తోమ్! రెడ్డి ముసి ముసి నవ్వులు నవ్వుతూ— నిన్న జరిగిందంతా చెప్పి,

"దొంగవెధవ— — భీముడు స్వంత పొలమయినట్టే గంతులు వేసాడయ్యా. సానిది విటరాయుడ్ని పట్టుకుని— నీపేనా పతిరాయుడి వన్నట్టు— దొరగారికి కూడా భయమేసి వుంటుంది— "ఇది నా చేనా, భీముడి చేనా" అని. అంతా గొల్లుమని నవ్వారు. రెడ్డిబాబు ఆటమూసాడు.... రావుగారు కౌంట్ ఇచ్చుకున్నారు.

మొన్నరాత్రి భీముడ్ని పిలిపించి— 'రావుగారి పొలంలోని రెండెకరాలు తనచేన్లో కలిపినాక దూరపెట్టనిస్తే రెండువందల రూపాయిలిస్తాననీ, ఇదంతా దొరగారికి తెలిసే ప్రమాదమేలేదనీ, దొరగారికి తనచేలు ఎటు ఎన్ని ఎకరాలున్నాయో తెలియదనీ— యిటు వేపు రానేరాడు కనుక తెలిసే ప్రశ్న లేదని' రెడ్డిబాబు భీమునికి నూరిపోసిన సంగతి రావుగారికి తెలియదు. —భీముడిది ఎందుకు చెప్పలేదో తెలియదు!

భీముడికి ఇష్టం వుండదని తెలిసీ ఇంత సాహసానికి రెడ్డిబాబు ఎందుకు పూను కున్నాడో తెలియదు. రెడ్డిబాబు బుర్రలో మన ముఖ్యమంత్రి కావలసినంత తెలివి తేటలూ, అర్హతలూ వున్నాయి. ఇక అతను మనకేం అర్థమవుతాడు!

రంగడికి రెడ్డిబాబు— దొరగారి అనుమతి తీసుకునే దున్నిపిస్తున్నానని చెప్పా డని, భీముడికి తెలియదు.

ఆరాత్రి— రెడ్డిబాబుకు— రంగడి రక్తం వరదల్లో తనయిల్లూ, పిల్లలూ కొట్టుకుపోతున్నట్టు పీడకల రావటంతో పిచ్చికేకలు వేసినట్టు ఎవరికీ తెలియదు.

"నా పొలంరా.... నా భూమిరా. "అన్న భీముని అరుపులే రావుగారి గుండెల్లో మెరుపులై.... ఉరుములై భయపెట్టడంతో రాత్రి రావుగారికి నిద్ర కరువయిందని.... ఎవ్వరికీ తెలియదు.

కాని కుక్కతోక వంకర అని అందరికీ తెలుసు.

## సెక్స్ సినిమాకి వెళ్లిన రాత్రి!

ఆర్. యస్. మూర్తి.

లీలామహల్లో ఏదో గూఢచారి సినిమా వచ్చింది. అందులో నటించిన యువతీమణుల ఊరించే గుండెల్నీ, కవ్వించే పిరుదుల్నీ, ఉద్రేకపర్చి ఉన్మత్తపర్చే అంగాల్నీ, ఉత్తేజకరమైన పోజుల్లో— బహిరంగస్థలాల్లో ప్రదర్శించి— ఆ సినిమాని తప్పక తిలకించి, ఆనందించమని సినిమావాళ్లు మరీమరీ ఉద్బోధించేరు ప్రజల్ని! రాజబాబు స్నేహితులంతా సినిమా చూసొచ్చి, "గొప్ప సెక్సీగావుంది గురూ పిక్చరు, మిస్సవకు సుమీ!" అని అతన్ని మరీమరీ హెచ్చరించేరు. సెక్సుకి సంబంధించిన విషయాల్లో ఆసక్తిగాని, అనుభవంగానీ లేకపోయినప్పటికీ, 'పోనీ— స్పై థ్రిల్లర్ కదా. సెన్సేషనల్ ఫైటింగ్సూ, హెయిర్‌రేజింగ్ బాక్సింగ్సూ అవీ ఉంటాయికదా, ఓసారి చూసొస్తే మునిగిపోయిందేవి' టన్న ఉద్దేశ్యంతో ఆఖరోరోజు రాత్రి రెండో ఆటకి ఒంటరిగా వెళ్ళేడు రాజబాబు.

* * *

....బీచొడ్డున మెత్తటి ఇసుకలో, ఆహ్లాదకరమైన వెన్నెల్లో, ఊరించే కన్నులుగలది, ఉవ్వొంగిన స్తనములుగలది అయిన ఒక అందాలరాసి అందంగా, అర్థనగ్నంగా పడుకుని వుంటుంది. అనాచ్ఛాదితకాయుడు, బలాఢ్యుడు అపురూప సౌందర్యవంతుడూ అయిన యువకుడొకడు ఆ యువతిని ఆక్రమించుకుని, ఒకచెయ్యి ఆమె మెడక్రింద,

మరోచేయి రొమ్ములమీద వేసి ఆమె అధరసుధా మకరందాన్ని ఆస్వాదిస్తూ ఉంటాడు. ఆ యువతి ఆ యువకుణ్ని దగ్గిరిసా ఇంకా దగ్గిరిసా తీసుకుంటూ, హృదయానికి గాఢంగా హత్తుకుంటూ,– కళ్ళలో ఆ సమయంలో కలిగే హావభావాల్ని ప్రదర్శిస్తూ ఉంటుంది. ఇంతలో ముద్దుచప్పుడు మ్యూజిక్కుతో ఆ నటీనటు లిద్దరిపేర్లు తెర మీదకు వస్తాయి ఆ సినిమా అలా ప్రారంభమవుతుంది

ఆ ఓపెనింగ్ సీను చూడగానే హాల్లో ప్రేక్షకు లందరిలాగానే రాజబాబుకి కూడా నరాలు ఝల్లు మన్నాయి. కోరికలు ఖస్సుమన్నాయి. ఆ సీనొక్కటి అలాటిదైతే ఏ చిక్కూ లేకపోను. కాని ఆ సినిమా మొదట్నించి చివరిదాకా అలాటి దృశ్యాలతోనే నడుస్తుంది. ముద్దులు, కౌగలింతలు, తాగడాలు, తన్నుకోడాలు, పెదాలు కరుచుకోడాలు, బట్టలు విప్పుకోడాలు. ఆడాళ్లని ఎత్తుకోపడాలు, జలక్రీడలు, జఘనాల తాటింపులు, పయోధరాల పిదిలింపులూ, నవ్వులు, నగ్ననృత్యాలు,– కార్లలో, పడవల్లో, విమానాల్లో సృష్టికార్యాన్ని సూచించే ఫీట్సూ, మాదర్న్ వెపన్స్‌తో యుద్ధాలూ, అందులో హూటోడుబు ప్రదర్శించే సాహసాలూ, వారి వారి రహస్యావయవాల విలాసాలు, విక్షేపాలు, వెకిలిచేష్టలు. రేప్సు, మర్డర్స్ ఇలాంటి ఉత్తేజకరమైన దృశ్యాలతో మొత్తంమ్మీద అ సినిమాహాలు హాలంతట్నీ ఊపేసింది. యావత్ప్రేక్షక జనానీకాన్ని కవ్వించి, ఉద్రూతలూగించి, వేడెక్కించి తహతహలాడించి ఉన్మత్తుల్ని చేసింది. ఇవన్నిచూసి సరదాపట్టలేక కొంతమంది విద్యార్థులు చప్పట్లుచరిచి. ఈలలు వేసేరు. రాజబాబు మాత్రం మదన వికారంతో భగభగా మండిపోయేడు. నరాలు బిగుసుకుపోయేయి. రక్తం హీటెక్కి పోటెక్కింది. ఆ రోజువరకు అతనిలో నిద్రాణమైవున్న యవ్వన వాంఛలు పడగవిప్ప బుసకొట్టేయి. అతనికి తెరమీదపడి హీరోయిన్ని అమాంతంగా బిగియార కౌగలించుకుని మరీ నలిపిపారేద్దా మన్పించింది తన ఎదుటిసీట్లో కూర్చున్న సోల్జర్‌పేట దొరసాన్ని పదిరూపాయలిస్తాను బీచ్‌కివస్తావా అని అడిగేయాలన్పించింది. తనవెనకసీట్లో కూర్చున్న సోడాకళ్లద్దాలవాడి కళ్ళద్దాలు లాక్కుని వాడి ఎత్తుగుండెల కర్రిపెళ్లాన్ని, రావణాసురుడు సీతని ఎత్తుకుపోయినట్టు ఎత్తుకుపోవాలన్పించింది. ఆమూల సింధీబట్టల షాపువాడిపక్కన సినిమాస్టారులా సింగారించుకుని కూర్చున్నవాడి వయసుమళ్ళిన దిబ్బపెళ్లాన్ని ఆక్షణమే బీచికి బరబరా లాక్కుపోయి చిత్ర విచిత్రంగా చిత్రహింసలు పెట్టాలన్పించింది. సింధీదానికి నాలుగు సీట్లవతల కూర్చున్న లిప్‌స్టిక్‌పెదాల బెంగాలీ కాలేజీగర్ల్‌తో ఆ హాల్లోనే, ఆసీట్లమధ్యే, ఆక్షణమే పడుకోవాలన్పించింది. ఆ సినిమా మొత్తమ్మీద ఒక్కడైలాగైనా రాజబాబుకి అర్థం

కాలేదు. కాని ఆ సినిమా మాత్రం మరోమారు చూడాలన్పించింది. ఒక్కసారికాదు లక్షసార్లు చూడా న్పించింది. అంతమంచి సినిమాని అంత తక్కువరోజులే ఆడించి నందుకు సినిమాహాలు వారిమీద అతనికి విపరీతమైన కోపం వచ్చింది.

సినిమా అయిపోయేక రాజబాబు సీట్లమధ్య దారికడ్డంగా నిలబడ్డాడు. సినిమా హాల్లోంచి బైటికివచ్చే జనం గత్యంతరం లేక అతన్ని ఒరుసుకుని వెళ్తున్నారు. స్త్రీల తాలూకు గుండ్రిటి భుజాలు ఒంటికి తగులుతున్నాయి. సిగలోని పూలదండలు నాసికా గ్రాన్ని చుంబిస్తున్నాయి. పాలిండ్ల పార్శ్వభాగాలు హృదయాన్ని పలకరిస్తున్నాయి. ఎగిరిపడే పైటలు శరీరానికి గిలిగింతలు పెడ్తున్నాయి. ఆ అనుభూతుల పరంపరకి చలించిపోతూ, పు కించిపోతూ సోడా కళ్ళద్దాలవాడి కర్రిపెళ్లాం—దగ్గరకు వచ్చేవరకు ఆలాగే నిలబడ్డాడు రాజబాబు. ఆమెని దగ్గరకు రానిచ్చి ఆవిడముందు నడవడం ప్రారంభించేడు. ముందున్న జనం నెమ్మదిగా నడుస్తున్నారు. వెనుకనున్న జనం ముందుకు తోసేస్తున్నారు. రాజబాబు ఐడియా ఫలించింది. సోడాకళ్ళద్దాల కర్రిపెళ్లాం ఎత్తుగుండెలు వీపుకి తగుల్తున్నాయి. మెత్తటి స్త్రీ రొమ్ములు; కమ్మటి సెంటువాసన, రాజబాబుకి మైకం కమ్ముతోంది. శరీరం తేలిపోతోంది. ఏదో మధురమైన ఆవేశం. వెనక్కి తిరిగి ఆమెను గట్టిగా హృదయానికి హత్తుకుని, కౌగిట్లో బిగించి, ముద్దుల్తో ముంచెత్తేసి, పిప్పి పిప్పిచేసేసి ఆమెలో ఐక్యమైపోవాలనే ఉధృతరసికావేశం. సినిమా హాలుబైటికి వచ్చేసరికి అతనింక ఆవేశాన్ని ఏమాత్రం అణుచుకోలేకపోయేడు. మేల్కొన్న మృగవాంఛని, క్షణక్షణానికి విజృంభించే రిరంసని అదుపులో పెట్టలేక పోయేడు. దేనికేనా తెగించీడానికి సిద్ధపడిపోయేడు.— 'ఏమైతే అవనీ; నలుగురూ తిడితే తిట్టనీ— కొడితే కొట్టనీ— మొహమ్మీద ఉమ్మితే. ఉమ్మనీ!— పరువూ ప్రతిష్ఠా మంటకలిస్తే కలవనీ!!— అనే మొండిధైర్యంతో— మదన వికారంతో వెనక్కి తిరిగి ఎత్తుగుండెల మయూరాక్షి వక్షోజాలమీద కామం పేరుకుని మండుతున్న చేతులువేసి రెప్పపాటుకాలంలో జనప్రవాహంలో కలిసిపోయి, మాయమైపోయేడు. తొలి సాహస చర్య నిరపాయంగా నెరవేరడంచేత అతను మరింత ధైర్యం పుంజుకుని మరో ఇద్దరు ముగ్గురు విరిబోడుల పీనపయోధరాలమీద కోరికల కొట్లువేసేడు. వీలుచూసుకుని సింధీ దాని నున్నటి పిరుదులమీద కూడా ఓమారు చేతులు పడనిచ్చేడు. బెంగాలీ అమ్మా యికి భుజం తగిలించేడు. సోల్జర్ పేట దొరసాని నడుమ్మీద చేతులు వేసేడు. ఆ జన సమ్మర్దంలో— ఇళ్ళకు చేరుకునే హడావుడిలో వాళ్ళెవరూ అతన్ని అంతగా పట్టించుకోలేదు.

సినిమా హాలుకి కొంచెం దూరంలో ఒక కాకాహోటలుంది. ఆ కాకాహోటలు పక్కనే ఒకచిన్న కిళ్ళీకొట్టుంది. కిళ్ళీకొట్టుకి కొంచెం ఎడంగా ఒక ఎలక్ట్రిక్ స్తంభం వుంది. స్తంభం పక్కన మున్సిపాల్టీవారి గుడ్డిదీపం చాటుచేసుకుని ఓ వారవనిత నిలబడుంది. ఆమె సన్నగావున్నా పుష్టిగావుంది. అప్సరస కాకపోయినా అందంగానే వుంది. మొహంలో కళవుంది, ఆమె కళ్లలో కైపుంది. ఆమె కట్టుకున్న తెల్లచీర రమ్యంగావుంది. ఆమె తొడుక్కున్న నల్లజాకెట్టు నిండుగావుంది.

ఆమెను చూడగానే రాజబాబు గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. కోరిక గోదావరి వరదలాగా చెలరేగి, పోటెక్కి, పరవళ్లుతొక్కింది. నరనరాల్లోనూ పొంగి పొర్లి ప్రవహించింది. కామోద్దీపితాలైన అతని కళ్ళకి ఆ 'రంకులాడి' తన వాంఛని చల్లార్చటానికి భగవంతుడు దయతోపంపిన దివ్యస్త్రీలా కనిపించింది.

రాజబాబుకి ఆ రోజుదాకా వక్కపొడి తప్పించి చెప్పుకోదగ్గ వ్యసనాలేవీలేవు. సిగరెట్లనీ, సినిమాలనీ దురలవాట్లులేవు. ఆడపిల్లల పిచ్చి మచ్చుకయినాలేదు. చాలా మంది యువకుల్ని బాధించినట్టు కామవాంఛలూ, కామోద్రేకాలూ— ఊహలూ అతన్నెప్పుడూ బాధించలేదు. వారకాంతల గురించి, వారివల్ల సంక్రమించే భయంకర రోగాల గురించి అతని స్నేహితులు వెకిలిగా మాట్లాడుకుంటూ వుంటే అతను చాలాసార్లు విన్నాడు. కాని వారకాంతల్తో కూడాలనే కోరిక అతనికెప్పుడూ కలగలేదు, కలలు కనలేదు, తాపత్రియపడలేదు. ఆరోజుదాకా అతని మనసంత నిర్మలంగానూ, నిష్కల్మషంగానూ ఉందంటే అందుక్కారణం— సెక్సు సినిమాలు, సెక్సు పుస్తకాల ప్రభావం అతనిమీద పడకపోవడమేనని ఢంకామీద దెబ్బకొట్టి చెప్పొచ్చు అతనారోజుదాకా అతనారోజుచూసిన సినిమాలాటి సినిమాల్ని చూడలేదు. చలం సాహిత్యంతోటి, మధు పుస్తకాలతోటి, ఛీపమెరికన్ లిటరేచర్తోటి, అతనికస్సలు పరిచయంలేదు. ఖరీదైన బూతుబొమ్మల పుస్తకాలుంటాయని అతనెప్పుడూ వినలేదు వాటికోసం జనం విరగబడి చస్తారని తెల్సుకోలేదు. రాజబాబారోజుదాకా నూటికి నూరుపాళ్ళు అస్ఖలిత బ్రహ్మచారన్చెప్పొచ్చు. అతనారోజుదాకా తన చదువు, పుస్తకాలు తప్పిస్తే మరో లోకంలేదని అనుకుంటూండేవాడని పందెం కట్టి చెప్పొచ్చు.

కాని ఆతనారోజు చూసిన సినిమా అతన్లో మరుగుపడివున్న కోరికల విష సర్పాన్ని నాగస్వరం ఊది మేల్కొల్పింది. ఆరోజుదాకా అనుభవంలోకి రానట్టి అనుభూతుల్నీ, ఆవేశపుటుద్రేకాల్నీ రేపి రెచ్చగొట్టింది. అతనికి నిషాఎక్కించి ఉన్మత్తుణ్ని

చేసింది. అంచేత ఆరోజు రాత్రి ఆడదైతే చాలుననుకునేటంత హీట్లో ఉన్నాడతను. ప్రాణాలుపోయినా సరే కోరిక తీర్చుకోవాలనేటంత ఆవేశంతో ఉన్నాడతను. కోరిక తీర్చుకోకపోతే ప్రాణాలు పోతాయేమో నన్పించేటంత అవస్థలో ఉన్నాడతను.

అట్టి పరిస్థితుల్లో ఆ వేశ్యాలలామ కళ్లముందు ప్రత్యక్షమవడంతో అతని జ్వరం నూటపది డిగ్రీలకి పెరిగిపోయింది. అతని రక్తం ఆగలేక తొందరచేసింది. దహించుకుపోయింది అతనికి కళ్లు బైర్లుకమ్ముతున్నట్టు— కాళ్లు, చేతులు తేలిపోతున్నట్టు అనిపించింది. కోరికతీర్చుకోవడ మొకటే అతనికి ఉత్తమమార్గంగా కనిపించింది. బాధ చల్లార్చుకోవడ మొకటే అతనికి అత్యవసర విషయంగా పరిణమించింది. కోరికతీర్చుకోడం కూడా పెద్దకష్టవేఁవీఁ కాదిప్పుడు.

కోరిక చల్లార్చే వెచ్చటి ఆయుధం కళ్ళముందే వుంది.
కోరి రమ్మంటే కౌగిట్లోకివచ్చి వాలుతుంది.
కావాలంటే—
ఒక్క కనుసైగ—
ఒక్క కంటిపిలుపు—
జేబులో అయిదు రూపాయల నోటు—
ఉంటే చాలు.
అంతా సెటిలయిపోతుంది.
వెచ్చటి సుఖాన్ని రిక్షాలో వాటేసుకుని,
మెత్తటి మల్లెపూల చెండుని ఆఘ్రాణిస్తూ,
తియ్యటి అధరాల మధువుల్ని ఆస్వాదిస్తూ,
పుబ్బుకెరటాల అంచులమీద పరుగులుతీస్తూ,
కళ్లుమూసి తెరిచేలోగా బీచికి పోవచ్చు.
రాజబాబు గుండెలు గుబగుబ లాడేయి.
కోరికలు గుర్రాలై పరుగులు తీసేయి.
తను "ఊఁ," అంటే చాలు స్వర్గద్వారాల కవాటాలవే తెరుచుకుంటాయి
స్వర్గసుఖాల రాసులు ఒడిలోకొస్తాయి.
బీచోడ్డుని మెత్తటిసుకలో—
చిక్కగా కురిసే వెన్నెల్లో—

గిలిగింతలు పెట్టే చల్లగాల్లో—
విరిగిపడే కెరటాల పాటల హోరులో—
ఒంటరిగా తనూ—
తన ఒడిలో ఆమే—
రాజబాబుకి ఓపెనింగ్ సీను గుర్తుకువచ్చింది.
ఒళ్ళు జలదరించింది.
తను "ఊ" అంటే చాలు. అంతా ఏర్పాటైపోతుంది. క్షణంలో బీచికి పోవచ్చు—
బీచొడ్డున సంబరం చెయ్యొచ్చు. కాని— ముందర తను 'ఊ' అనాలి.
"ఊం" అన్లమా ? మాన్లమా ?।
రాజబాబుకి "ఊం" అనాలనే వుంది.
కాని అన్డానికి భయంగా వుంది ధైర్యం చాలకుండా వుంది.
సందేహాలు, సందేహాలు— అన్నీ సన్దేహాలే। భయాలే।।
'రోగాలేవన్నా అంటుకుంటాయేమో'—
కుర్రాడివి కదా। నీకిదేం పోయేకాలం అంటుందేమో—
అందరి ముందు తన్నవమానిస్తుందేమో—
తీరామోసి బీచికివెళ్లేక చేతకాపోకతే నవ్వుతుందేమో— వెక్కిరిస్తుందేమో—
రౌడీలచేత తన్నించి.— వాచీ రింగులూ వొల్చుకుపోతుందేమో—
పోలీసులు పట్టుకుని లాకప్పులో పెట్టేస్తారేమో—
రిక్షాలో వెళ్తుంటే తెల్సినవాళ్ళెవరైనా చూస్తారేమో—
రేపొద్దున్న ఆస్పత్రికి మూడోనంబరు వార్డుకివెళ్తే ఇంజక్షన్ ఇస్తారో—
ఇవ్వరో— అక్కడ అంతా వెటకారం చేస్తారేమో—
స్నేహితులు ఎవరికైనా తెలిస్తే 'ముండ జబ్బుల' మహరాజని ఏడిపిస్తారేమో—
రాజబాబు మనసులోని భావాల్ని ఆమె ఎలా పసిగట్టిందో, రెండడుగులు
ముందుకివేసి "కావాలా" అని అతినెమ్మదిగా అర్థమయేట్లుగా అడిగింది.
రాజబాబు గుండెలు దడ దడ దడ దడ లాడేయి.

'తొందరగా ఏదో వొకటి తేల్చుకోవాలి— ఆమె పిలుపుని అంగీకరించడమో.
తిరస్కరించడమో— ఏదో ఒకటి— అటో, ఇటో— వాంఛని చల్లార్చుకోకపోడంవో—
చల్లార్చుకోడమో— ఏదో ఒకటి తేల్చుకోవాలి— త్వరగా, త్వరగా—'

రాజబాబు నడక మందగించింది.
రాజబాబు బుర్ర మిషన్లా పనిచేస్తోంది.
'ఏదో ఒకటి వేగిరం తేల్చుకోవాలి— ఇటో, అటో— త్వరగా తేల్చుకోవాలి—
అతని అంతరాళంలో తుఫాను, యుద్ధం—
ఒకపక్క వాంఛ, మరోపక్క భయం—
పోరాటం, సంగ్రామం—

'ఏమయ్యా రాజబాబూ! ఏదో ఒకటి తేల్చుకోవయ్యా!! ఆడదాన్ని అలా భయపడతావేమయ్యా! సాహసించవయ్యా!!!
చేజిక్కిన అదృష్టాన్ని జారవిడువకయ్యా!

'విడువను గాక విడువను, ప్రాణాలు పోయినా సరే, తిరుగులేని రోగాలు తగులుకున్నా సరే— ఈఛాన్సు వదలనంటే వదలను '
రాజబాబు మగసిరి పుంజుకున్నాడు. సాహసం చెయ్యటానికి పూనుకున్నాడు.
"ఏయ్, రిక్షా! ఇలారా..."

రిక్షా వచ్చింది... రాజబాబుకోసం కాదు సినిమా హాల్లో అతని పక్క సీట్లో కూచొని సినిమా చూస్తున్నంతసేపూ కారాకిళ్లీతో మిళితమైన సారాకంపుతో ముక్కుపుటాలు అదరగొట్టిన బండపెదాల బొండాంగాడి కోసం. రాజబాబు వాంఛ చల్లార్చడానికి భగవంతుడు దయతోపంపిన దివిజకాంత కాస్తా, బోండాంగాడి కౌగిట్లో వాలి కనుమరుగైపోయింది

రాజబాబు ఉస్సురుమన్నాడు బోండాంగాడిని చంపేద్దామన్నంత కోపం వచ్చిందతనికి. చేతికి చిక్కిన అదృష్టాన్ని మరెవడో లెంపకాయకొట్టి లాక్కున్నట్టనిపించిందతనికి. కసితో అతని హృదయం రగుల్కొపోయింది. బోండాంగాడిని బూతులు తిట్టుకుంటూ, కాళ్ళీడ్చుకుంటూ, చేజారిపోయిన స్వర్గానికి చింతిస్తూ ఇంటిదారి పట్టేడు రాజబాబు.

తడితడిగా వెన్నెల కాస్తోంది ఉండుండి చల్లటి పిల్లతెమ్మెరలు వీస్తూన్నాయి. వాంఛ, ఆరని వాంఛ, తీరని వాంఛ— అతని నరాల్ని కాల్చేస్తోంది. అతని మనోనేత్రాల ముందు నగ్నస్త్రీలు— నృత్యం చేస్తున్నారు. వివస్త్రలు గావించబడిన రమణీమణులతో రాజబాబు క్రీడిస్తున్నాడు. ఆహా! ఈ ఊహాలోకం ఎంత కమ్మగా, తియ్యగా, పసందుగా ఉంది! ...

ఎవరో జంట ఒకరినొకరు కౌగిల్లో బంధించుకుని రిక్షాలో ఇంటికికాబోలు వెళ్తున్నారు. రాజబాబు రిక్షాలో ఆ స్త్రీ పక్కన భర్తస్థానంలో తన్నూహించుకుని లొట్టలు వేసేడు. ఎవరో ఇద్దరు యువతులు, తెలుగు సినిమానించి కాబోలు ఆడుకుంటూ, పాడుకుంటూ, అరుచుకుంటూ బూతులు తిట్టుకుంటూవస్తున్నారు. వాళ్ళిద్దరూ ఝామ్మని వయసులో వుండి, బాబాస్వీట్ స్టాల్లో అప్పుడే తయారు చేసిపెట్టిన తాజా మిఠాయి ఉండల్లా ఉన్నారు. వారిరువురినీ ఏ రహస్య ప్రదేశానికైనా లాక్కుపోయి ఇద్దర్నీ ఒకేసారి అనుభవించాలన్పించింది రాజబాబుకి.

రోడ్డుపక్క గోడలమీద వాల్‌పోస్టర్లు అతికించబడివున్నాయి. ఓచోట ఓ వాల్‌పోస్టర్లో రీటా హేవర్త్ చాలా అందంగా ఉంది. రాజబాబు రోడ్డుపక్కగా వెళ్లి ఆమె రొమ్ములమీద చేతులు వేసేడు. 'ఈ క్షణంలో ఈ బొమ్మకు ప్రాణాలొస్తే ఎంత బావుణ్ను!' అనుకున్నాడు.

నూకరాజు కిల్లీకొట్టుకి దగ్గర్లో ఉన్న బస్సుస్టాపులో, పక్కనేవున్న రోడ్డుదీపం కాంతిలో, ఓ బీదగుంట వంటరిగా పడుకుని దొర్లుతోంది. ఏదో జానపద చిత్రాల్లోని బూతుపాటలు ఎలుగెత్తి పాడుతోంది. అది బీదదే అయినా అందంగా ఉంది. చిన్నదే అయినా చీరలుకట్టే వయసుదాన్లా వుంది. మాసిన దుస్తులే అయినా మనిషి శుభ్రంగా, సబ్బేసి కడిగినట్టుగా ఉంది. జీవితంలో ఎప్పుడూ దుఃఖమూ, దరిద్రమూ తప్పిస్తే సుఖమెఱగనిదాన్లా వుంది. 'దీని చేతిలో అయిదు రూపాయలు పెట్టి, బీచికిపోయి వాంఛ తీర్చుకుంటేనో!' అనిపించింది రాజబాబుకి. "ఇలాంటి బీదగుంటలు డబ్బిస్తానంటే ఎంతకేనా తెగిస్తారు" అని తనని తాను ఉత్సాహపరుచుకున్నాడు. 'ఇది తొడగడమయితే పరికిణీ జాకెట్టు తొడిగిందిగాని చూడ్డానికి టక్కుల టమారిలా కనబడుతోంది' అనుకుంటూ బస్సుస్టాపుని సమీపించేడు. ఆపిల్ల వెల్లకితలా పడుకుని "ఇంద, ఇంద తీసుకో"— అంటూ ఓ బూతుపాటని పరమానందంగా పాడుకుంటోంది.

"ఏయ్, నీపేరేఁవిఁటి!" అని అడిగేడు రాజబాబు.

ఆపిల్ల తన సంగీతాన్ని ఆపి, రాజబాబు కళ్ళల్లోకి బెదురుబెదురుగా చూసింది. ఆకల్తో ఉన్నపులిని ఆవుదూడ చూసినట్టు చూసింది.

"నీ పేరేఁవిఁటి?"

"మా లచ్మి"

"పేరు బావుందే! నాతో బీచికివస్తావా... అయిదు రూపాయలిస్తాను" అన్నాడు రాజబాబు సిగ్గుతో చచ్చిపోతూ. అతనిమాటలు అతనికే వెకిలిగా. వికృతంగా. భయంకరంగా ధ్వనించేయి. ఎందుకేనా మంచిదన్చెప్పి. అతను ఐదురూపాయినోట్లు చేత్తో పట్టుకుని ఆడించేడు.

ఆపిల్ల రాజబాబు మొహంవేపు కాసేపు వింతగాచూసి, "అమ్మా. ఈఁడుసూదే!" అంటూ గావుకేక పెట్టింది.

బస్సుస్టాపు వెనక పాడుపడి, కూలిపోతూ, ఇవాళా రేపా అన్నట్లున్న ముష్టింట్లోంచి, "ఏటే మాలచ్మీ" అన్న స్త్రీకంఠం వినవచ్చింది.

"ఈ గొల్లిగాడు సూదే!...."

రాజబాబు గుండెల్లో రైళ్లు పరిగెత్తేయి. రాజబాబు కాళ్ళు నాటంతట అవే సమయోచితంగా పనిచేసేయి. అతను పుంజాలు తెంచుకుని పరిగెట్టడం మొదలెట్టేడు. చెత్తకుండీలో ఎంగిలాకులకోసం గాలిస్తున్న రెండు ఊరకుక్కలు భౌభౌమంటూ అతన్ని వెంబడించేయి. 'అమ్మ గుంటముండ ఎంత పన్చేసిందీ,' అనుకుంటూ అతను మరింత పిక్కబలం చూపెట్టాడు. అలా పరిగెట్టి బంగారయ్య ఇంటిదాకా వచ్చేసేడు. బంగారయ్య ఇంటిదగ్గరికి వచ్చేక ఓమాటు ఆగి, వెనక్కి తిరిగిచూసి, ఎవరూ వెంట తరమటం లేదని నిర్ధారించుకుని, నెమ్మదిగా నడవటం మొదలెట్టేడు. బంగారయ్య రాజబాబు వాళ్ళ ఎదిరింటి వాళ్ళ చాకలిమనిషి. బంగారయ్య పెళ్లాం సత్యవతి ఎర్రగా, పిషుగా, బంగారపు బొమ్మలా ఉంటుంది. దానికోసం రాజబాబు వీధిలోని కుర్రాళ్ళంతా పడి ఛస్తారు.

చాకలి దంపతులిద్దరూ ఆరుబైట నులక మంచమ్మీద ఒకరినొకరు కౌగలించుకుని పడుకున్నారు చాకలివాడి కాళ్లు చాకలిదాని మీద వున్నాయి. చాకల్దాని పెదాలు చాకలివాడి బుగ్గలమీద వున్నాయి. చాకల్దాని రొమ్ములకి చాకలివాడి ఛాతియే ఆచ్ఛాదన. వాళ్ళిద్దరూ ఒళ్ళుమర్చి నిద్రిస్తున్నారు. ఆ దృశ్యాన్ని చూస్తూవుంటే రాజబాబు కాళ్ళు కదలడానికి ఇష్టపళ్లేదు. 'నేనే ఆ చాకలివాడినైపోతే ఎంత బావుణ్ణు!' అనుకున్నాడు రాజబాబు నులకమంచానికి కొంచెం ఎడంగా ఒక తాటిచెట్టుంది. తాటిచెట్టు చాటున నిలబడి చాకల్దాన్ని పరిశీలనగా చూసేడు అతను. వెన్నెలపడి చాకల్దాన్ని నున్నటి చెక్కిళ్లు అద్దాల్లా మెరుస్తున్నాయి. ఆచ్ఛాదనలేని పాలిండ్లు లీలగా, మాయగా. మనో

హరంగా కనబడుతున్నాయి. రాజబాబు రక్తం సెగలుకక్కింది. చాకలివాణ్ని మంచ మ్మీంచి తోసేసి చాకల్దానితో పడుకోవాలన్నంత ఆవేశం కలిగింది.

రాజబాబు ఇంటికి చేరుకునేసరికి ఒంటిగంటన్నరయింది. రాజబాబు వదినగారు- పద్మావతీదేవి ఒళ్లుమరిచి నిద్రపోతోంది వాకిట్లో.

రాజబాబుకి వదినంటే ఎంతో భయం. భక్తి. అభిమానం. అనురాగం. గౌరవం. అతడామెను మాతృసమానురాలిగా భావిస్తాడు. ఆరాధిస్తాడు. ఆమెకూడా అతన్ని కన్నకొడుకులానే చూసుకుంటుంది. ఆమెకు పిల్లాజెల్లాలేరు. రాజబాబు అన్న డాక్టరు. అతను పెళ్ళయేక సంవత్సరమైనా తిరక్కుండానే పై చదువులకి అమెరికా వెళ్ళేడు. వెళ్ళి రెండేళ్ళయింది. ఇంకో ఆర్నెల్లో తిరిగి రాకపోతే సంవత్సరం పట్టొచ్చు. విమెన్సు కాలేజీలో టీచరుగా పన్చేస్తున్న వదినకి సాయంగా వుంటూ- మెన్స్ కాలేజీలో బియ్యే చదువుకుంటున్నాడు రాజబాబు.

"వదినా! వదినా!!" తలుపు తట్టేడు రాజబాబు.

ఆమె నిద్రమత్తులో తూలుతుంటూ వచ్చి తలుపు తీసింది. ఒంగుని తలుపు తీస్తూంటే ఆమెపైట జారింది. పల్చటి జాకెట్టులోంచి బలిష్టమైన పాలిండ్లు తొంగి చూసేయి. అప్రయత్నంగా రాజబాబు చూపులటు మరిలేయి. అతని కళ్లు చెదిరేయి. అతని శరీరంలో విద్యుత్తుప్రవహించింది. పరిస్థితుల ప్రభావంగా మాతృభావం మరుగు పడి, అతన్లో ఉద్రేకం-పశుత్వం రెచ్చగొట్టబడ్డాయి.

'ఛీ, ఛీ! ఎంత పతనం!' రాజబాబు అంతరాత్మ ఘోషించింది.

అతను నేరం చేసినవాడిలా దృక్కులు మరల్చుకుని, తలొంచుకుని తన గది లోకివెళ్ళి దుస్తులు మార్చుకున్నాడు. దుస్తులు మార్చుకుంటూ వుండగా పద్మావతి అతని గదిలోకివచ్చి, "సినిమా ఎలావుంది రాజూ?" అనడిగింది. తను దుస్తులు మార్చుకుంటూ వుండగా వదిన తనగదిలోకి రావడం అదే మొదటిసారి కాకపోయి నప్పటికీ అదోలా అన్పించింది రాజబాబుకి, పైగా ఆమెతన్నే గుచ్చిగుచ్చి చూస్తు న్నట్టుకూడా అతనికి అనుమానం కలిగింది.

"ఓమాదిరిగా ఉంది ఒదినా" అన్నాడతను- చాలాబాగుందన్చెప్పడానికి సిగ్గు పడిపోయి.

"నువ్వు భోంచేస్తావా? చపాతీలు తింటావా రాజూ?"అని అడిగింది వదిన,

"ఇప్పుడేంవద్దు వదినా!" అన్నాడు రాజబాబు మరోసారి ఆమె పాలిండ్లని చూడాలనే కోరికను బలవంతంగా అణుచుకుంటూ.

"అదేవిటి! ఎందుకొద్దు? సాయంత్రం కూడా ఏం తినలేదుకదా! వదవద! ఇన్ని చపాతీలు తిను. చపాతీలు తిని, కాస్త పాలుతాగి పడుకో్కి. ఏం?" అంటూ బలవంతం చేసిందావిడ.

"అక్కర్లేదు వదినా!" మొండికేసేడు రాజబాబు.

"ఆకలదేవేస్తుంది రెండే రెండు చపాతీలు తిను పోనీ"

"అస్సలాకల్లేదు"

"నామాట విను!"

"తినాలని లేదు"

"ఐతే నీ ఇష్టం. పోనీ పాలివ్వనా?"

వదినని సంతోష పెట్టడంకోసం ఈసారి "సరే" అన్నాడు రాజబాబు. వదిన తెచ్చిన పాలగ్లాసు అందుకుంటూ శిఖరాల్లా మొనతేలి ఉన్న ఆమె స్తనద్వయాన్ని చూడాలనే కోరికను నిగ్రహించుకో లేకపోయేడు రాజబాబు.

కోరికతో వణికిపోతూ వాకిట్లో వదినపక్క మరో మంచమ్మీద పడుకున్నాడు రాజబాబు. క్షణక్షణానికి అతని వాంఛ లావాలా విజృంభిస్తున్నది. వదినమీదికి పరుగులు తీస్తున్న మనసుకి కళ్ళెం వెయ్యడం కష్టంగావుంది. అంతరాత్మ చేసే హెచ్చరికల్ని యవ్వనం లక్ష్యం చెయ్యకుండా వుంది. మదమెక్కిన యవ్వనాన్ని యుక్తాయుక్త విచక్షణాజ్ఞానం గొలుసులు వేసి బంధించలేకుండా వుంది. నరాలు అంతకంతకూ బిగుసుకుపోతున్నాయి. శరీరం అంతకంతకూ వేడెక్కిపోతోంది. రక్తం అంతకంతకూ పోటెక్కుతోంది. రక్తనాళాలు బద్దలైపోతాయా అన్పిస్తోంది.

"ఒదినఅంటే కన్నతల్లికాదు. రక్తం పంచుకు పుట్టిన సోదరికాదు. ఒదిన్ని కామించడం పెద్ద తప్పేం(పేం)కాదు. వయసులో ఉన్న కుర్రాళ్ళకి ఇలాటి కోరికలు కలగడం అసహజం కాదు" అంటూ యవ్వనం రాజబాబుకి ధైర్యం చెప్తోంది. లొంగ దీసుకుంటోంది. యవ్వనం పిలుపుని రాజబాబు కాదనలేకపోయేడు. అంతరాత్మ మెడ పట్టుకుని గెంటేసి హృదయ కవాటాల్ని మూసేసేడు. యవ్వన కాంక్షతో ఒదినవేపు చూసేడు. ఈసారి ఆమె వక్షోజాల్ని ధైర్యంగా సర్వేచేసేడు.

రాజబాబుకి తను చూసిన సినిమాలోని ఒకదృశ్యం గుర్తుకి వచ్చింది. అందులో హీరోయిన్ నీటుగా ముస్తాబై మంచమ్మీద పడుక్కుని వుంటుంది. ఇంతలో హీరో రాకెట్టులా దూసుకువచ్చి దబ్బున ఆమెమీద పడిపోతాడు. వాళ్ళిద్దరూ ఒకరినొకరు కౌగిళ్ళలో బంధించుకుని, మంచంమీద దొర్లిదొర్లి, రక్తాలు కారేలా పెదాలు కొరికేసుకుని కొరికేసుకుని; ఒకరిదుస్తు లొకరు చింపేసుకుని ఒకళ్ళనొకళ్లు నలిపేసుకుని నలిపేసుకుని చిత్తుగా ఒకటయిపోతారు.

రాజబాబుకి వదిన్ని అలా చెయ్యాలన్పించింది. అలా నలిపేయాలన్పించింది.

కాని అలాచేస్తే వదిన ఏమంటుందో? తిడుతుందా? కొడుతుందా? అసహ్యించుకుంటుందా? ద్వేషిస్తుందా? "రాజూ నువ్విలా చేస్తావని కల్లోకూడా అనుకోలేదు. ఎందుకిలా చేసేవ్ రాజూ!" అంటూ మూలుగుతుందా? బాధపడుతుందా? ఏడుస్తుందా? మొత్తుకుంటుందా? తనతో మాట్లాడ్డం మానేస్తుందా? అన్నయ్యకి ఉత్తరం రాస్తుందా?

కాదు. వదిన అవేవీ చెయ్యదు. వదినకి మాత్రం కోరికలుండవా? ఆమె మాత్రం మానవ మాత్రురాలుకాదా? మానవ సహజమైన ఉద్రేకాలు ఆమెకు మాత్రం ఉండవా? వదినకసలు మొదట్నుంచి తనంటే కొంత ఇదే. ఏ ఇదీ లేకపోతే తనమీద ఎందుకింత ఆపేక్ష చూపిస్తుంది? తనకి చిన్నపిల్లాడిలా ముద్దులుచేసి అన్నమెందుకు తిని పిస్తుంది? తనని అప్పుడప్పుడు అక్కున చేర్చుకుని, "రాజూ నీకెవరంటే ఎక్కువిష్టం?" అని చిన్నపిల్లల్ని అడిగినట్టు ఎందుకడుగుతుంది— ఏ ఇదీ లేకపోతే?.... ఒకసారి తనని కళ్ళుమూసుకోమని తనుండగానే దుస్తులు మార్చుకుంది. మరి దీనికి అర్థమేమిటి? తనేం చిన్నవాడా— చితకవాడా? ఇరవైయేళ్లు దాటేయి. మీసాలుకూడా వచ్చేసేయికదా! ఎన్నిసార్లు తనని కౌగిలించుకుని డాబామీద పడుకోలేదు వదిన. ఇన్నాళ్ళూ తనెప్పుడూ వీటిగురించి ఆలోచించలేదు. అంతగా పట్టించుకోలేదు కాని ఇప్పుడు, తల్చుకుంటే అన్పిస్తోంది— వదిన మనసులో ఏకోరికా లేకుండానే ఇవన్నీ చేసిందా అనీ— వదినక్కూడా తనలాటి కోరికలేవుంటాయి. తనలాంటి సంకోచాలే వుంటాయి. తను చొరవతీసుకుంటే, పిలిస్తే, సాహసిస్తే వదిన ఎంతమాత్రం అడ్డు చెప్పదు— అనుకున్నాడు రాజబాబు.

వదినని చూస్తున్నకొద్దీ రాజబాబు వాంఛ తీవ్రమౌతోంది. రక్తం పరవళ్లు తొక్కుతోంది. అణువణువూ దహించుకుపోతోంది. రాజబాబు తలగడాని గుండెలకి హత్తుకున్నాడు. 'వదినా! వదినా!!' అంటూ తలగడని ముద్దుపెట్టుకున్నాడు.

సినిమాలో దృశ్యాలన్నీ అతని కళ్ళముందు తిరుగుతున్నాయి. అతని ఆవేశానికి ఇంధనాన్ని సమకూరుస్తున్నాయి. కళ్లద్దాలవాడు, కర్రిపెళ్లాం గుండెలు, రీటాహేవర్త్ ఉరోజాల సొబగులు, బెంగాలీగాల్ నడుం వొంపులు. చాకల్దాని సోయగాల సొంపులు, సింధీదాని పిరుదుల బెళుకులూ, హరిజన యువతుల వయ్యారపు తళుకులూ, భోగందాని కాటుకకళ్లలోని గూడుకట్టుకున్న కోరికల సౌందర్యాలూ— అవన్నీ అతని మనో నేత్రాలముందు మెదిలి అతన్ని వదినమీదకి సాహసం చెయ్యడానికి పురికొల్పుతున్నాయి. మదనుడి బాణాల గాయాల తాపానికి తట్టుకోవడం చివరకు దుర్భరమై— 'ఈ క్షణం హరిమీద గిరిపడినా, గిరిమీద హరిపడినా, భూనభోంతరాలు బద్దలైనా సరే నేను వదిన్ని అనుభవించి తీరాల్సిందే!' అని దృఢంగా నిశ్చయించుకుని ఆమె నిద్రిస్తున్న మంచంవేపు నడిచేడు.

పద్మావతి ప్రశాంతంగా నిద్రపోతోంది. ఆమె కళ్లు కాగి, బరువెక్కి వాలి పోయినట్లు అందంగా, మనోహరంగా వున్నాయి. ఆమె చెక్కిళ్ల పాలుకారుతున్నాయి. ఆమె పెదాలు తేనెలోవూరి ఉబ్బిన గులాబీరేకుల్లా వున్నాయి. సమున్నత వక్షం సవాల్ చేస్తున్నట్లుంది.

ఒదినను సమీపించేసరికి రాజబాబు ధైర్యం కాస్తా రబ్బరు బంతిలోంచి గాలి తీసేసినట్లు బుస్సుమంది. అతని వాంఛమాత్రం మరో పదిరెట్లు అధికమైంది.

ఆ పెదాలతేనె జుర్రాలి. ఆ శరీరాన్ని పువ్వున్నలిపివేసినట్లు నలిపేయాలి, ముద్దుల వర్షంతో ముంచెత్తాలి— రాజబాబు ఉద్రేకానికి అవధుల్లేకుండా వుంది. కాని సాహసం చెయ్యడానికి ధైర్యం చాలకుండా వుంది.

రాజబాబు వెనక్కి తిరిగొచ్చి మంచమ్మీద కూర్చుని వదినవేపు కన్నార్పకుండా చూసేడు. కటకటాల్లోంచి ప్రసరించే వెన్నెల కాంతిలో ఆవిడ అహల్యాదేవిలా కని పించింది. రాజబాబుకి స్పార్కులా చక్కటి ఆలోచన తట్టింది. వదిన దుప్పటి కప్పు కోలేదు కదా! తనేవెళ్ళి దుప్పటికప్పితే! ఆమెని తాకడానికిదే మంచి ఛాన్సు! ఒకవేళ లేచినా దుప్పటి కప్పుతున్నానన్చెప్పి తప్పించుకోవచ్చు. వ్వాట్ ఎ బ్రిలియెంట్ ఐడియా! రాజబాబు నెమ్మదిగా అతినెమ్మదిగా ఆమె వొంటిమీద దుప్పటికప్పేడు ధైర్యంగా, కాని అతి మృదువుగా సమున్నత వక్షాన్ని స్పృశించేడు. తృష్ణతో నెమ్మ దిగా నిమిరేడు. వాంఛ సర్పంలా అతన్ని పెనవేస్తోంది. శరీరం వశం తప్పిపో తోంది. మండుతున్న పెదాలతో అతను వదినమీదకు ఒంగేడు.

ఇంతలో ఆమె నెమ్మదిగా కదిలింది.

అతను వడివడిగా కొట్టుకుంటున్న గుండెల్తో గాభరాగా లేచి ఒక్కంగలో తన మంచాన్ని చేరుకున్నాడు. ఊపిరి బిగపట్టి నిద్రపోతున్నవాడిలా నటించేడు. రాజబాబు భయపడ్డట్టు ఆమె లేవలేదు. ఇట్నుంచి అటు తిరిగి పడుకుంది.

రాజబాబు తన పిరికితనానికి తనే సిగ్గుపడ్డాడు. 'ఛీ ఛీ ఈసారి ఆరునూర యినా, నూరారైనా వదిన్ని కౌగిట్లో బిగించుకోవాలి!!' అని నిశ్చయించుకున్నాడు. మరింక ముందువెనకా ఆలోచించకుండా వెళ్ళి ఆమె పక్కనే కూర్చున్నాడు. ఆమె పిరుదుల్ని తాకేడు. శరీరం వొంపుల్ని వెతికేడు మెడచుట్టూ చెయ్యివేసేడు. జాకెట్టు లోకి చేతులు పోనిచ్చేడు.

"ఎవరది? రాజూ!" అంటూ పద్మావతి దిగ్గువలేచింది.

రాజబాబు గడగడలాడిపోయేడు. అతనికి ముచ్చెమటలు పోసేసేయి. తనగుండె ఆగిపోలేదుకదా అనిపించిందతనికి చెవుల్లోంచి వెచ్చటి ఆవిర్లు కమ్ముకున్నాయి. బుర్ర పన్చేయడం మానేసింది. గుడ్లు మిటకరిస్తూ శిలాప్రతిమలా నిలబడిపోయేడు.

"ఏవిఁటి కావాలి రాజూ!" పైట సర్దుకుంటూ అడిగింది పద్మావతి.

రాజబాబుకి అనుకోకుండా ఆపద్బాంధవిలా చక్కటి అబద్ధం నోటికివచ్చేసింది.

"వంటింటి తాళాలు కావాలి వదినా!"

పద్మావతి వంటింటి తాళాలెప్పుడూ తన పరుపుకిందో, తలగడాకిందో పెట్టు కుంటుంది.

"తాళాలెందుకు? మంచినీళ్ల కావాలా రాజూ! మంచంకింద ఉంటాయి తీసుకో" అంటూ తనేతీసి– రాజబాబు చేతికి మంచినీళ్ళ గ్లాసందించింది.

రాజబాబు గుప్‌చప్‌గా మంచినీళ్ళు తాగి వచ్చి తన మంచమ్మీద వాలిపోయేడు ఉస్సురుమంటూ.

పద్మావతి కూడా ఓ గ్లాసుడు మంచితీర్థం పుచ్చుకుని– బాత్రూంకి వెళ్ళొచ్చి, ఓమారు పైటా, కుచ్చెళ్ల సవరించుకుని లైటార్పి పడుక్కోబోతూ– రాజబాబు వేపు తిరిగి– "నీకు దుప్పటి అవీ ఉన్నాయా రాజూ! ఇంకో తలగడా ఇమ్మన్నావా?" అడిగింది.

"ఇంకేం అక్కర్లేదు వదినా!" అని పైకని మనసులో మాత్రం 'నీ సౌందర్యం కావాలి వదినా!' అనుకున్నాడు రాజబాబు.

ఆరాత్రి ప్రయత్నాన్ని అంతటితో విరమించుకుని తీరని వాంఛతో నిద్రపట్టక పక్కమీద ఇటూ - అటూ పొర్లి— తెల్లవారుఝామున ఏ నాలుగ్గంటలకో నిద్రాదేవి కటాక్షించి కౌగిట్లోకి తీసుకోగా ఆదమరచి నిద్రించిన రాజబాబు మర్నాడుదయం పది గంటలకిగానీ లేవలేదు.

రాజబాబుకి నిద్రలేవగానే ఎంచేతనో పెద్ద తుఫానువచ్చి వెలిసినట్లనిపించింది. తన హృదయాన్ని పట్టిపీడించిన పెనుభూతమేదో వదిలిపెట్టి నట్టనిపించింది. అతనికి రాత్రి జరిగిన సంఘటనలన్నీ ఒకటొకటీ గుర్తుకువచ్చేయి. తన ఊహలూ, ఉద్రేకాలూ తల్చుకుంటే సిగ్గువేసింది. తల్లిలాటి వదినకోసం, తను చేసిన ప్రయత్నం— పడ్డపాట్లు తల్చుకుని అతను పశ్చాత్తాపంతో కుమిలిపోయేడు. కళ్ళల్లో నీరు తిరిగింది, తలగడాలో తలదాచుకుని వెక్కి వెక్కి ఏడ్చేడు. రాజబాబుకోసం బెడ్ కాఫీ పట్టుకుని అప్పుడే వచ్చిన పద్మావతి అతని ఏడ్పుచూసి ఆశ్చర్యచకితురాలైంది.

"అదేవిటి రాజూ! పొద్దున్నే ... ఆసలేవయింది!" అని ఆర్ద్రంగా అతన్ని అక్కున చేర్చుకుంది.

"వదినా! ఇంకెప్పుడూ పిచ్చిపిచ్చి సినిమాలు చూడను. ఇంకెప్పుడూ పశువులా ప్రవర్తించను. నన్ను క్షమించు.... వదినా...." అంటూ బావురుమన్న రాజబాబుని చూసి అసలు సంగతి అర్థంకాక తెల్లబోయింది పద్మావతి!

—oo✿oo—

ప్రస్తుతం చలామణీలోవున్న మాతాలు - మోజస్, క్రీస్తు, మహమ్మద్ మొదలయిన వారందరి మతాల్ని నేను నిరాకరిస్తాను. మానవుల్లో పరస్పర విద్వేషాల్ని పెంపొందించి, అసహనాన్ని అభివృద్ధి పరచడమేగాక బయట ఎక్కడో వున్నాయనుకొనే ఏవో శక్తులకు మానవుడ్ని బానిసగా చేస్తున్నాయి. ఈ భ్రాంతులు నాశనంకావాలి. అప్పుడే పరస్పర వైరుధ్యాలు లేకుండా సామరస్యంతో తన సర్వశక్తులనూ అభివృద్ధిపరచుకుంటూ తోటి మానవులు అభివృద్ధి చెందడానికి తోడ్పడే నూతన మానవుడు జన్మిస్తాడు.

—మాక్సిం గోర్కీ

పరిశీలన:

# పైగంబర కవులు - విప్లవ కవులా ?

సి. ఎ. జగన్‌మోహన్

విప్లవ కవిని రెవల్యూషనరీ రొమాంటిక్ అని అతిసాధారణార్థంలో పిలుస్తూ దుయ్యబట్టేవాళ్లు కొంతమంది. కాని ఏ కవికైనా వైయక్తిక దృక్కోణం తప్పనిసరిగా ఉంటుంది. కాని ఆవైయక్తిక దృక్కోణం అన్నది కవికి Cocoon కాదు, ప్రారంభ దశలోతప్ప అయితే విప్లవకవి ఏదశలోనైనా Cocoon లో నివసించడు. పరిపూర్ణ మైన సామాజిక అవగాహన ఉన్ననాడే విప్లవకవి అవుతాడు. విప్లవకవి మేధావికూడా. జాఁ పాల్‌సార్త్రి చెప్పినట్లు మేధావులంతా లెఫ్టిస్టులే, వారివారి అంచలలో.

ఇటీవలి తెలుగు కవిత్వంలో ఈ అవగాహనతో రాసినవారు సి. విజయలక్ష్మి, దిగంబర కవులు. తిరగబడు కవులు, (మార్చ్ కవులు వీరిలో కొంతమంది వి.ర.సం. కవులయ్యారు), ఇదే క్రమంలో వచ్చినవారు పైగంబరకవులు. 'అభ్యుదయ కవు'లని పేరుతెచ్చుకున్న కొంతమంది అభ్యుదయ కవుల్లో 'అభ్యుదయం' నామావశిష్టంగానే మిగిలిం తర్వాత 'ప్రగతి శీలం కవిత' అనిచెప్పి తెలుగు కవిత్వాన్ని మళ్లీ సరియైన మార్గంలో పెట్ట ప్రయత్నించినవారు సి. విజయలక్ష్మి. వీరు మార్క్సిస్టు సిద్ధాంతంలో మంచి విశ్వాసం ఉన్నవారు. వక్రమైన రాజకీయ, సాంఘిక పరిస్థితుల్లో పుట్టి పెరిగిన యువతరానికి కొంచెం ముందున్నవారు. తర్వాతి తరం— యువతరం— అదే దిగంబరతరం— సామాజికావగాహన ఉండీ, సంఘంలో జరిగే అరాచకాలకూ, అక్రమాలకు తక్షణం ప్రభావితమవుతూ కూడా ప్రస్తుత సమస్యల పరిష్కారానికి మార్గం చూడలేక కొట్టు మిట్టాడింది. తిరుగబడమంది. ఈతరంలో మానవతావాదం ఎంత ఉందో అన్నిరాజకీయ- సాంఘిక వ్యవస్థల ఎడల అంత సినిసిజమ్ ఉంది. ఇంకోవేపు ఇదే తరానికిచెందిన 'తిరగబడు కవులు' 'మార్చ్' రాసిన 'విప్లవ కవులు' మార్క్సిస్టు ఆలోచనా ధోరణిలో సాయుధ విప్లవమే పరిష్కారమార్గ మన్నారు. ఈ అన్ని ప్రవాహాలూ చివరికి వి. ర సం. లో ఏకీభావం చెందాయి. ఆ సమయంలోనే 'పైగంబర కవులు' అని తమను తాము పిల్చుకుంటూ ఒక అయిదుగురు యువకవులు వి.ర.సం వేదికపైకి అక్టోబరు 1970 లో వచ్చారు.

విరసం ఆవిర్భవించింది 4 జులై 1970. అప్పటివరకే పైగంబరుల 'యుగ సంగీతం' వెలుగు చూసింది.

ఈ కవులు తమకంటె ముందువచ్చిన విప్లవ కవులంతా సంఘంలో కుళ్ళును, అరాచకాలను, అక్రమాలను చూసి ఎంత తీక్షంగా, కసిగా ప్రభావితం అయ్యారో అంతగా కాలేదనిపిస్తుంది. ముందుకవుల్లో మార్క్సిస్టు దృక్పథం ఎంత కొట్టవచ్చినట్లుగా కన్పిస్తుందో అంత కన్పించదు వీరిలో. వీరు ప్రపంచాన్ని ఒక 'సమస్యల కీకారణ్యంగా', దారితోచని 'ఘోర నిబిడ నిశీథి'గా దర్శించారు. 'ఈ కారుచీకట్లో ప్రస్థానం సాగించాలంటే వెలుగు రేఖలు అవసరం! ఆ 'సమస్యల కీకారణ్యంలో మానవతా రథం పథం చూపించే టార్చిలైటు' వీరి కవిత్వం. 'ఒకింత చిత్తస్థైర్యం— మరొకింత చిత్తనైర్మల్యం— మానవతా దృక్కోణం— సెలయేటి గలగలల్లా సాగిపోయే సాఫీ అయిన విచారణా దృక్పథం' (మామాట) మానవుడు మహామనీషిగా మారటానికి కావాలి.

'గగనాన మంచులో, తెల్లని చల్లని పాలపుంతా, భూమిమీద నల్లని వెచ్చని తారురోడ్డూ ఈ యువకవుల ప్రస్తుత భావనా ప్రపంచ పరిధులు' డా॥ పి. రాజారామ్ గారు చెప్పినట్లు. ఇదొక ఐడియలిస్టు దృక్పథం. వారి ఐడియలిస్టు ప్రపంచాన్ని సృష్టించడానికి కావాల్సిన ఆలోచనాధార ఏమిటి మరి?

పైగంబర కవులు మానవతావాదులు. కాని 'సమస్యా పరిష్కారానికి, సమరస భావం ఎంత అవసరమో— కొన్ని వేళల్లో కరకు కత్తిలా వ్యవహరించడం కూడా అంతే అవసరం అని నమ్మిన' వాళ్ళు, అయితే మానవ సమాజమంతా నిశీథిలో, ఊబిలో దిగబడి ఉన్నప్పుడు వాళ్లను బయటికి లాగేదెవరు? ఆ మానవుల్లో విజ్ఞానులైన వాళ్లా? లేక పైగంబరులా? ఈ ప్రశ్నకు సమాధానం లభిస్తుంది ఒక కవితలో—

వెలివేసిన పేటల్లోంచి/ దగాపడిన గల్లీల్లోంచి/
వగదూరిన గర్భంలోంచి/ పగబట్టిన పిడికిలిలోంచి/
శేష చేతనలోంచి/ అగ్నిపండిన/ అశేషజనుల
ఆర్తినుంచి/ ప్రభవించింది విప్లవం!/ దీన్నెవరు
అడ్డగలరు? మహోగ్రి మానవతా మస్తిష్కాగ్రం నుండి/
ప్రభవించిందీ ఉషస్సు/ దీన్నెలా చెరుపగలరు??

(అమృతం : సుగమ్‌బాబు)

సమస్యా పరిష్కారానికి 'బాధా సర్పదష్టుని నేతృత్వం'. విప్లవం కావాలంటాడు కవి.

పైగంబర కవి కిరణ్‌బాబు తాము ప్రారంభించబోయే విప్లవ యజ్ఞానికి 'క్షుధా సర్పదష్టు' లందర్నీ పెదాలపై నవ్వుల దివ్వెలు వెలిగిస్తూ, శాంతికపోతాల నెగురవేస్తూ సహపంక్తి భోజనానికి రమ్మని ఆహ్వానాన్ని అందచేస్తున్నారు. ఆ విప్లవ యజ్ఞంవద్ద ఎలా ఉంటుందంటే!

ఒక పక్క
అమానుల్లాఖాన్
పారాయణ చేస్తాడు ఖురాన్!
మరోపక్క—
రెవరెండ్ ఫాదర్
ఆలపిస్తాడు 'పీస్ ప్రేయర్!'
ఇంకో పక్క—
సత్యనారాయణశాస్త్రి
చేస్తాడు మంత్రాల్తో ఇష్టి
శ్రీశ్రీశ్రీ అనంత ధర్మావధాన్లు
అప్పగిస్తాడు నాల్గు వేదాలు!
అందుకే—
స్వచ్ఛమైన నీహారకణాల్లా
మీ మనస్సులు కడుక్కొని రండి!

ఇదేదో సర్వమత సామరస్యంలా, అక్బరుపాదుషా స్థాపించిన 'దీన్ ఇలాహి' మతంలా ఉంది. మానవుడు పక్కమానవుణ్ణి మానవత ఆధారంగా కాక మతసామరస్య ధోరణిలో ప్రేమించడం నేర్చుకుంటాడన్నమాట పైగంబరులాకాంక్షించే విప్లవ యజ్ఞం తెచ్చే కొత్తప్రపంచంలో. డెమక్రటిక్ సెక్యులరిజం!

పైన ఉదహరించిన కవితను చదివినపుడు సత్యనారాయణశాస్త్రి చేసే మంత్రాల్తో ఇష్టి, శ్రీ శ్రీ శ్రీ అనంత ధర్మావధాన్లు అప్పగించే నాల్గువేదాల ప్రసక్తి వచ్చినపుడు కవి మంత్రోచ్చారణను, వేదపారాయణాన్ని, ఖురాన్ పఠనాన్ని, శాంతి ప్రార్థనా

లావణ్యాన్ని వ్యంగ్యధోరణిలో విమర్శిస్తున్నాడా లేక మతసామరస్యపరంగా ఉదహరిస్తున్నాడా తెలియటంలేదు. ఇది అభివ్యక్తిలో లోపమన్నా కావచ్చు లేక వ్యంగ్యం (irony) లోని క్లిష్టత (ambiguity) అన్నా కావచ్చు ననిపిస్తుంది.

ఇంకొక కవితలో సుగమ్‌బాబు స్వాతంత్ర్యాన్ని షేర్వాణీతో పోలుస్తాడు. ఇరవై అయిదేళ్ళన్నా కాకముందే / 'కుట్లన్నీ ఊడిపోయి/ రంగంతా వెలిసిపోయి/ గోనెపట్టా కంటే ఘోరంగా/ చీటిగుడ్డకన్నా హీనంగా తయారయింది!/... తెలివిమీరిన వాళ్ళందరిలోనూ, షేర్వాణీలో—/ ఎవరి కందినంత ముక్క వాళ్ళు చించుకుపోవాలనే తపన/ మరీ ఎక్కువైపోయింది!/ పెద్దవాళ్ళ పెద్ద ఎత్తుల్లోనూ/ స్కేళ్ళు, కత్తెర్లు బాహాటంగానే పట్టుకుంటున్నారు! / దీనితో— తెలివిలేనివాడి గుండెల్ని/ నడిబజార్లో పట్టపగలే పీక్కుతింటుంది / ఇలాగా సాగితే షేర్వాణీ గతేంకాను?' అండర్‌లైను చేసిన పంక్తుల్లో అర్థమేదీ నాకంతుపట్టలేదు. ఇలాంటివి ఈ 'యుగ సంగీతం'లో అక్కడక్కడా కన్పిస్తాయి.

'యుగ సంగీతం'లోని కవితల్ని అన్నిట్నీ పరిశీలిస్తే వీరి కప్పటికి (జులై 1970 నాటికి) కవికి అత్యవసరమైన భాషపైన అధికారం, అభివ్యక్తి, తామువాడే శబ్దబింబాల (images) సంపూర్ణావగాహన, వ్యంగ్యం (irony), స్పష్టత (clarity) మొదలగు కావ్యప్రయోజనాల గురించిన జ్ఞానం సరిగా అబ్బలేదనిపిస్తుంది. దీనికితోడు ఒక సమగ్రమైన దృక్పథంకూడా లోపించింది. వీరు పీడిత ప్రజలున్నారని గుర్తిస్తారు. పీడిత ప్రజల సమస్య లన్నింటికీ మౌలికమైన పరిష్కారం విప్లవమని గుర్తిస్తారు. కాని ఈ 'బాధాసర్పదష్టు'లకు మతంవల్ల, వ్యక్తులవల్ల, మానవత్వమనే పరమార్థంవల్ల కల్గిన సంకటాల గుర్తించలేరు

బహుశః ఇవన్నీ ప్రారంభదశలోని లోపాలు, అసమగ్రత అనుకుంటాను. ఎందుకంటే పైగంబర కవుల రెండవ సంపుటాన్ని పరిశీలిస్తే (యుగ చైతన్యం) ఈ లోపాలు ఎక్కువగా కానరావు. వాళ్ళొక్కొక్కరికి ఒక స్వంతమైన శైలి ఏర్పడింది. కొంతవరకు ఆలోచనా ధోరణిలోనూ మార్క్సిస్టు అవగాహన పెంపొందించుకున్నారు.

'న్యాయంకోసం ధర్మంకోసం/ పోరాడేవారికి యింతకన్న (సంకెళ్ళకన్న) ఘన సత్కారం ఏమిటి?' (ఓల్గా: ఎర్రపిజం) అన్న దారుణమైన నగ్నసత్యాన్ని గ్రహిం

చారు. అలాపోరాడే వారిలో 'ఒకరు వచ్చినా— పదిమందికి ఆవేశం కల్గిస్తున్నా'డని గమనించారు. స్వార్థపరులు, ఆధునిక కాపిటలిస్టుల 'ధ్వంస మనస్తత్వంలోంచే మిమ్మ (కాపిటలిస్టుల) సర్వనాశనం చేసే మహోగ్రమానవతా విప్లవశక్తి జనిస్తుంది' (దేవీప్రియ : ది ఎకో)

'నీవు దోచిన అమాయకపు గొర్రెల్లాంటి ప్రజలు/ నిన్ను గగనాంతర సీమల్లో/ విహరింపనివ్వరు— /వారు, /వారి ఆకటిలోకి,/ వారి బ్రతుకు పెంటికటిలోకి,/ వారి చిరుగుల తాటాకుల కుటిలోకి./ నిన్ను లాగుతారు—

(కమలాకాంత్ : కలుపు మొక్కలు)

మార్క్సిస్టు ధోరణిలో వచ్చిన విప్లవం ఒక కొత్త వ్యవస్థను, సమానత్వం ప్రాతిపదికగాగల పునరుజ్జీవనాన్ని ప్రసాదిస్తుంది తరతమ భేదంలేకుండా. ఒక విప్లవ కవి అటువంటి కొత్త ప్రపంచాన్ని దర్శించి ఆ ప్రపంచంలోని సర్వమానవ కళ్యాణాన్ని గురించి చెప్పాలికాని ప్రతీకారభావంతో ఇప్పుడు దోచుకొనేవారిని విప్లవం తరువాత దోచుకొనబడేవారి నరకంలోకి పంపిస్తామనటం వారి మార్క్సిస్టు అవగాహనలో లోప మనిపిస్తుంది.

శక్తి, పదునూ, సమాజపు లోతులోకి, మనిషినీ మనిషినీ విడదీసే గోడల్లోంచి చూడగల నిశితత్వమూ, దెబ్బతిన్న బెబ్బులిలాంటి కసీ, కవిత్వాన్ని ఒకగొప్ప సాధనంగా వాడుకోగల సమర్థతా—— సంయమనమూ, తీక్షతతో, ఒక్కొక్క కవితను సమగ్రకవితా ఖండికగా మార్చగల నేర్పూ పైగంబర కవుల్లో కన్పించదు మార్క్సిస్టు ఆలోచనా ధోరణిని సమకాలీన సంఘానికి అన్వయించి చూడగల దర్శనశక్తీ వీరిలో అంతగా గుర్తించలేము.

# 'మృత్యుంజయులు' నవల - ఒక ప్రశంస

ఎస్. కె.

విప్లవం చావుకు అర్థాన్నిస్తుంది. అవసరం చేతికి ఆయుధాన్నిస్తుంది. న్యాయం మీద నెత్తుటి మరకలు మమతను నా అన్న సంకుచితాన్ని త్యాగంచేసి బలిదానాలు రక్త తర్పణాలు చేసేందుకు ఉద్యుక్తులను చేస్తాయి. కడుపులుకొట్టి మానాలు చెరిచిన అధికారం గుండెల్లో పిడికత్తులు గుచ్చాలన్న కసి పిడికిళ్ళు బిగింపచేసిన నెత్తురు ప్రజావెల్లువగా ఉత్తుంగ తరంగాలవలె ఉప్పెనలా ఎగసి వచ్చినప్పుడు ఏ మందీమార్బలం మర తుపాకీ సిబ్బందీ ఎదిరించి నిలువలేని సత్యాన్ని చరిత్ర చాటుతుంది.

చరిత్ర సత్యాన్ని చాటిన, తెలంగాణా పోరాటాన్ని చిత్రించిన 'మృత్యుంజయులు' నవల ఆనాటి నిజాం నిరంకుశపాలన పదఘట్టనల్లో నలిగిన ప్రజల్లో చెలరేగిన ఉద్రేకాన్ని రచిస్తుంది. ప్రభువు పాలనలో సాగిన స్వార్థపిశాచుల కోర్కెల కోరల్లో పడి నలిగిన అమాయక ప్రజల హాహాకారాల నుండి చెలరేగిన అగ్ని 'మృత్యుంజయులు'.

మమకారాన్ని తెంచుకోలేక కడుపుతీపి కోసుకోలేక కన్నకొడుకును ఉద్యమం నుండి వెనక్కి పిలువాలన్న ఆరాటంలో ఉన్న తల్లి కళ్ళముందర తనకూతురు చెరచబడి తన పెనిమిటి దేశముఖ్ దౌర్జన్యానికి బలియై కొడుకు రాక్షసుల చేతుల్లోబడి నాలుగు సంవత్సరములు కూడా సరిగా నిండని తన మనుమడు కత్తికి గుచ్చబడి ఆకాశములోనికి ఎత్తబడ్డప్పుడు కన్నీళ్ళు కరడుగట్టి గుండెరాయియై నిప్పులుజిమ్మే కళ్ళతో తనే ఉద్యమానికి ముందునడుస్తూ ఎదురు తిరగలేనివారి నందరిని 'చావు వదలి రమ్మంటున్నాను. ఇంతవరకు మనమంతా చచ్చినవాళ్ళం. మీకు ప్రాణం పోస్తున్నాను. నాలో ప్రాణం పోసుకుంటున్నాను. సమరానికి పిలుస్తున్నాను' అని గొంతెత్తిన ఆనాటి తల్లుల రూపంలో రాములమ్మ—

బ్రతుకుమీది భయంతో పట్టణాలలోనికి బ్రతుకుదెరువు కోసం పారిపోయి పట్టణాల్లో రెక్కలు విరగగొట్టుకొని మరయంత్రాలు రక్తాన్ని పొగలావదిలే గొట్టాలే తప్ప తలదాచుకోవడానికి జానెడుజాగా ఆకలి తీర్చుకోటానికి కనీసం అంబలికూడా నోచుకోక

బ్రతుకంటె భయంకాదని బానిసత్వం కాదని కదలే ప్రజావెల్లువలో కాలుకలిపి సాగిపోయేదే బ్రతుకని పాఠాలునేర్పే మనిషిగా నరసిరెడ్డి—

పిరికిగా వొదిగి వున్నంతకాలం సమస్యలు తీరవు. సరికదా కనీసం బ్రతికే అవకాశం కూడా మిగులదని తెలుసుకొని కులాలు మతాలు పాలకుని కుతంత్రాలుగా తెలిపి పాలించే జాతి ఏదైనా పాలింపబడేవాడు మాత్రం ఎప్పుడూ బానిసేనని కాలే కడుపులన్నీ ఒక్కటి కష్టించేరెక్కలన్ని ఒక్కటి దేశముఖ్ పటేల్ నవాబు ఎవడైతేనేం ప్రజల నెత్తురుతాగి బలిసే ప్రతి ఒక్కడు ప్రజాశత్రువని చాటే యువకులకు ప్రతీకలుగా హిందూ ముస్లిం కలయికకు సాక్షిగా ఎల్లారెడ్డి. సుబాన్—

పాలకజాతికి అమ్ముడుపోయి ప్రజల మనసుకు ఎక్కక కుక్కచావు చచ్చే దిక్కులేని వాళ్లగా పటేల్, అప్పన్నా. మహబూబ్—

తండ్రి నెత్తురు పంచుకొని పుట్టినా తప్పుడు పనులకు దూరంగా ప్రజలను సంఘటితపరచి బాధ్యత నెరవేర్చుకొని ప్రాణాలను సహితం లెక్కచేయని కొడుకులకు చిహ్నంగా మురహరి—

అధికారమత్తులో తెగబలసి అరాచకాలుచేసే ప్రజాద్రోహిగా రావుసాహెబు వెంకట నారాయణరెడ్డిగారు, పోలీసు బందోబస్తులు, చస్తే పన్నులు, ఇవ్వకుంటే ఖూనీలు, మారణ హింసాకాండలు, దారుణాలు ఎన్నో, ఎన్నెన్నో ...... .... ... వీటన్నిటిని చేయూత ఇస్తే ఎవడైనా ఎల్లారెడ్డి, నర్సిరెడ్డిలాంటివాడు ఒక్క అడుగు ముందుకువేస్తే ఉప్పెనలా కదలివచ్చి ఎదిరించి గుండ్లకు ఎదురుగా గుండెలను నిలుపగల్గే ప్రజల సాహసాలు రక్తాల ధారవోతలు కలిగిన నవల 'మృత్యుంజయులు'.

బొల్లిముంత శివరామకృష్ణగారి ఈ నవల గోర్కీ వ్రాసిన 'అమ్మ' నవల యొక్క ఇన్స్పిరేషన్. అంతమాత్రం చేత తక్కువగా చూడాల్సింది ఏమీలేదు. రష్యాలో విప్లవం వస్తే అక్కడి విప్లవం ఆదర్శంగా మరెక్కడైనా విప్లవం వస్తే విప్లవంలో పురోగమించినందుకు సంతోషించాల్సిందే. కాని మరోవిధంగా భావించి చిన్నతనంగా ఎంచుకోవడానికి అవకాశంలేదు.

'మృత్యుంజయులు' నవలలో పీడిత ప్రజల పోరాటాన్ని కలానికెత్తిన రచయిత ఇకముందు కూడ తాడితుల బాధలనూ, సాహసోపేతమైన పోరాటాలను గుర్తించి కీర్తిస్తాడని ఆశిద్దాం.

సమీక్షలు:

## "జాలిపాట"

కె. వి. రమణారెడ్డి

నాగుండె వెనుక జాలిపాటతో నా కవితను మ్రోగించి
కోట్లకోట్ల గుండెలై స్పందించగలనా?

అని బాధపడుతున్న అద్దేపల్లి రామమోహనరావు ప్రధానంగా హృదయవాది అయిన కవి. సాహిత్య- ముఖ్యంగా కవిత్వ. విమర్శకుడుగా పేరుదెచ్చుకున్నవ్యక్తి కాబట్టి శుష్కహృదయ వాదపు నీరసత్వంతోటి తృప్తిపడకుండా, హృదయచోదక శక్తిని మేధకు అంకితంచేశాడు. ఈరెండింటి ఎడపెడను మాన్పించి ఒద్దికను చేకూర్చాలని చేసిన ప్రయత్నమే "అంతర్జ్వాల" వచనగేయ సంపుటిలో కనిపిస్తున్నది.

సంకల్పమైతే స్పష్టంగానే కనిపిస్తున్నదిగాని ఫలితం అలాలేదు. రామమోహనరావు "మనిషి" మీద గురినిలుపుకున్నారు. ఆ "మనిషి" సామాన్యుడు. అతగాడు అనేక వయవంచనలకూ దుర్నయాలకూ గురై జీవిస్తున్నాడు. తన దుస్థితిని గూర్చి అతనికి స్పృహైనాలేదు. శాస్త్రాలు, మతాలు. రాజకీయాలు- చివరకు సాహిత్యాది కళలుకూడా సామాన్యుణ్ణి సామాన్యుడిగానే నిలిపి వుంచడానికి పనికివస్తున్నాయి తప్ప. "అసమ" స్థితినుంచి తప్పించి, పైకి తెచ్చేందుకు పనికి రావడంలేదు. అందుచేత "మనిషి"ని "మానవత్వపు సంచలనం"గా "వ్యక్తిత్వపు వికాసం"గా తీర్చిదిద్దాలంటే,

స్వార్థ రాజకీయాలు
కుహనా నాగరికతలు
దుష్ట సంస్కారాలు
మూర్ఖ సంప్రదాయాలు

నశించాలి. వేదాంతంమీద విశ్వాసం. రాజకీయాలమీద నమ్మకం. సంస్కర్తల మీద సహనం తనకు తప్పిపోతున్నదని రామమోహనరావుగా రంటున్నారు. "మనిషి" బాగుపడాలనే కోరికను జీవితవాస్తవం భంగపరుస్తున్నప్పుడు కవి అనుభవించే నిస్పృహనుంచి, విపరీతమైన క్రోధావిష్టత ఏర్పడుతున్నది. యథార్థం నుంచి కవి మనస్సు అయిష్టంతో రోతతో దూరమయ్యేకొద్దికీ, ఈమనస్స్థితి తీవ్రతరమౌతున్నది.

కనుకనే, పగలగొట్టాల్సిన వాటితోబాటు నిర్విచక్షణగా మంచివాటిని గూడా చరిత్ర శిథిలాలలోకి నెట్టివెయ్యడం జరుగుతున్నది.

ఓటుతో మనిషి గొంతునుకోసే రాజకీయాలు
అణువుతో మనిషికి గోరీకట్టే విజ్ఞానశాస్త్రాలు
అక్షరాలతో మనిషికాలికి సంకెళ్ళువేసే సాహిత్యాలు

ఇవన్నీ వదిలివెయ్యదగినవేనా అనేది, మొదటి ప్రశ్న. వీటన్నిటికీ ధనపక్షం లేదా అనేది, రెండోది. ధనపక్షం కూడా లేదనుకుంటే తప్ప వీటిని విధ్వంసించ బూనడం పొరపాటుకాదు, నేరమే. ధనపక్షం వున్నప్పుడు, వాటిని సంస్కరించుకో వడమే విజ్ఞత. కవితావేశంలో కూడా ఈ విషయాన్ని విస్మరించడం ఎవరికైనా క్షంతవ్యంకాదు.

రామమోహనరావు గారి భావనలో శ్రీకారం చుట్టుకుని నిలబడ్డ "మనిషి" అనబడే ఈ పదార్థానికీ యథార్థమానవుడికీ సంబంధం బొత్తిగా లేదనడం న్యాయం కాదేమోగాని, యథార్థమానవుణ్ణి పోలినంత మాత్రాన అతడే ఇతడని నిరూపించడం అసాధ్యమనిపిస్తున్నది. చరిత్రవాక్యంలో కర్తస్థానంలోగాక ఎప్పుడూ కర్మస్థానం లోనే వున్నవాడు, పైనుంచి ఎవరో కరుణాళువూ ఉదారహృదయుడూ దిగివచ్చి తన హృదయపు ప్రమిదలలో చైతన్యపు వత్తులువేస్తేనే తప్ప ఉజ్జ్వలంగా ప్రకాశించని మందుడు. వెనుకనుంచి నెట్టీ కిందినుంచి పూటీపెట్టీ ఎవరో సజ్జనులు తలా ఒకచెయ్యి వేస్తేనే తప్ప ముందడుగు వెయ్యలేక, కాలూ నిలవలేక తాకితేనే తూలిపడేట్లున్న దుర్బలుడు— ఎవడు ఈ "మనిషి?" ఇదొకలాంటి వూహాప్రతిమ మాత్రమే అనిపిస్తు న్నది. ఆధ్యాత్మిక పదార్థంగా (Metaphysical Category) కవి మనస్సును ఆక్ర మిస్తున్నది. ఈ మానవీయతకు ఒక మతస్థాయి ఏర్పడి, రాతిబొమ్మ బదులు రక్తమాంసాల బొమ్మ నిలబడుతున్నది. అందంచేతనే తనంతటతాను, గుణలోపాలతో కలిసి, నిండైన నిజంగా నిలబడలేకపోతున్నది. రామమోహనరావు గారి దేవుడనే వస్తువులాగానే మనిషి అనేదికూడా ఒకవస్తువు. 'ఓసి' అనిపించుకొన్నా క్రియలో ఇది నపుంసకలింగ శబ్దతుల్యమౌతున్నది.

రామమోహనరావుగారు ఈ మనిషిగురించి కార్చే కన్నీళ్లు "కృత్రిమ కన్నీళ్లు" (Sic) అని నేనుమాత్రం అనడంలేదు. కాకుంటే, తనసొంత ఆశలనూ ఆశయాలనూ కలలనూ కామనలనూ ఈ "మనిషి"లో కవిగారు పొదివిపెట్టుకున్నారు. రామమోహన

రావుగారి కావ్యనాయకుడైన "మనిషి" కొంతమేరకైనా రామమోహనరావుగారే నని పిస్తున్నది. ఆయనపాడే "జాలిపాట" తనను గురించికూడా ఎందుకంటే ఈ "మనిషి" ఆయన మానసపుత్రుడూ అయినందుచేతనే.

ఏ కవైనా తన కావ్యమూర్తుల్లో తాను కనిపించకుండా పోలేడు. ఈ దృష్టితో మాత్రం నేను పైమాటలు రాయలేదు. ఈకవి అన్వేషణ దేవుడితో మొదలై తనతో ముగిసింది.

అనంత జీవన జ్వాలావలయాల మీద
గిరగిరా గిరగిరా తిరుగుతున్న నేనెవర్ని ?

"అంతానికీ అనంతానికీ నడుమ/ సరిహద్దురేఖగా పడుకొన్న నేను" "నిన్నటి నీడల"కూ "రేపటి వెలుగుల"కూ లోబడిన వ్యక్తి. ఆ వ్యక్తి అవ్యక్తంనుంచి బయట పడి వ్యక్తిత్వంవైపు నడుస్తూంది. వర్తమాన సంగీతంతో తన పూపిరిని పూర్తిగా దిగించుకుని ప్రయోజకత్వాన్నీ సాఫల్యాన్నీ పొందగోరుతూంది.

ఇంతకు ముందే
సంస్కృతిని పూడ్చిపెడుతున్న
ఆధునిక సమాజ శ్మశానమధ్యంలో
భయంకర సమాధి లోపలినుండి
నన్ను నేను పిలుస్తున్న జాలిపాట విన్నాను।

ఇంతవరకూ తనది సమాధి జీవితమైతే ఇకముందు సమాజ జీవితం కావాలని రామమోహనరావు తపిస్తున్నారు. "నాలోని తిమిరాలకోసం/ మరణంలాగా జీవించడం మానేసి,/ ఇతర హృదయాల కాంతిరేఖలకోసం/ జీవిస్తూ మరణించా లనిపిస్తుంది—" అంటున్నారు.

బాగుందిగాని ఆధునిక మానవజీవితం గురించి రామమోహనరావు గారికిగల అవగాహన మాత్రం చాలా వైరభావంతో కూడుకొనివుంది. ఇది ధనస్వామ్యయుగమే కావచ్చుగాక, సామ్యవాది అయిన కవికూడా దీన్ని మొత్తంగానే నిరాకరించడు. నాగరికతను కట్టగట్టి గిరాటువెయ్యడు. విజ్ఞానశాస్త్రాన్ని గర్హించడు అది చెయ్యని అపరాధాలను దానిమెడకు చుట్టడు. దీన్నుంచి పొందవలసిన మంచినంతా పొందాలి ఇది భవిష్యత్సమాజానికి భౌతికమైన పునాది కాబట్టి ఆకాశహర్మ్యాలకూ, హృదయ మణి

మందిరాలకూటమోగాని, సామాజిక నిర్మాణానికి మాత్రం తప్పనిసరి. రామమోహన రావుగారు ఈ "సమరతలం" నుంచి "పారిపోయి హృదయం లోతుల్లో దాక్కోవ డానికి,/ నాగుండెలోని కండల్ని అక్షరాలుగా మార్చి జగత్తుని మరోవిధంగా చూపడానికి/ నాలో నేను దహించుకుపోతున్నా ను/ నన్ను నేను మోసుకోలేక/ నాలో నేను ఇమడక/ ఆకాశం ప్రతిధ్వనించేటట్లు అరుస్తున్నాను!" అంటున్నారు. ప్రతిధ్వనించవలసింది ఆకాశంకాదు. ఆకాశం గగనం శూన్యం. అది ప్రతిధ్వనించినా ప్రతిధ్వనించకున్నా మరేం ఫర్వాలేదు. ప్రతిధ్వనించ వలసిందల్లా మానవహృదయమే. రామమోహన రావుగారిది "వ్యర్థగీతం" కాకుండా వుండాలంటే, జరగవలసిందిదే.

---



---

కంఠంలో "సమస్తాభ్యుదయ కవుల సమిష్టి స్పందన" తోటి గుండెలో ఈ ప్రపంచపు తలుపుని తెరిచి "పురోగామి" వెంటనడిచి పోగోరుతున్న ఈ కవి, దేవ దేవుడితో ఈలోకం గురించి నివేదించుకునిగానీ గాంధీతో ఈ తరం గురించి మొర పెట్టుకునిగానీ, వివేకానందుణ్ణీ వీరేశలింగాన్నీ భక్తిశ్రద్ధలతో సంస్తుతించి సంస్మరించు కునిగానీ, చేకూర్చగల ప్రజాహితం చాలా, చాలాచాలా, కొద్ది. "అభ్యుదయ కవులు ఆవేశంతో/ బొమ్మలు బాదుకుని" చెబుతూవచ్చిన దీనజనోద్ధరణం కూడా "కృత్రిమ కన్నీళ్ళ" (Sic) వద్ద ఆగిపోయేట్లయితే, దేశమూ కాలమూ వాళ్ళను క్షమించవని ఇటీవలి చరిత్ర నిరూపించింది. "వెలుగు రేకల్లాంటి యువకులు", రామమోహన రావుగారే అంటున్నట్టుగా, "అన్యాయాన్నీ అక్రమాన్నీ అణువణువునా వ్యష్టిగానూ సమిష్టిగానూ ఎదుర్కోగల విప్లవతత్త్వం జీవనవిధానంగా మారినవాళ్లు" ఉన్నారు. రామమోహనరావు నడవవలసింది వారివైపే. అలాంటప్పుడు "ఈ దేశంలో విప్లవం వస్తుందా!"అని నిస్పృహ చెందవలసిన అవసరం ఉండదు కవుల మీద ఏ విప్లవమూ ఆధారపడి రాలేదు, రాబోదుగాని కవుల దోహదంతో వచ్చింది, వస్తుంది.

ఇటువంటి అంధకార బంధుర వాతావరణాన్ని చీల్చుకుని
స్థిరసంకల్పమూ
సంపూర్ణ మానవత్వమూ
సమగ్ర సామర్థ్యమూ
కళ్ళలో ఎఱ్ఱని జీరలుగా వెలిగే యువకులు
నారెళ్ళ ముందున్నారు :
వారుచాచిన చేతుల చూపుడు వ్రేళ్ల చివర
అఖండమై జ్వలించే అగ్నికీలలమీద నాభవిష్యదాశ !

ఆ యువకులుకూడా ప్రజా అక్షౌహిణులకు మొగదార్లుగా వుండినప్పుడే, రామ మోహనరావు గారిలాంటి మంచి మనస్సుగల కవుల ఆశ నెరవేరుతుంది. ప్రజలతో తప్ప ఏకాకులతో ఏ విప్లవమూ ఫలోన్ముఖంకాదు. ఆ ప్రజలను మూకగానో గుంపు గానోగాక, చైతన్య- వర్గచైతన్య- దీప్తితో వెలుగొందే మహాచారిత్రక శక్తిగా భావించి నప్పుడే. వ్యక్తీసమాజమూ బాగుపడేది. "మనిషికోసం మనిషిమీదుగా"గాక, మనషులు తమకోసం తాముగా సాగించే వుద్యమాలు నెరవేరేదీ అప్పుడే. మరి, అప్పుడూ ఆ తర్వాతా. రామమోహనరావుగారి భావనలో లాగా. హృదయానికీ మేధకీ ద్వైతం వుండదు, కళలకూ శాస్త్రాలకూ వైరుధ్యం వుండదు. అది సకలవిధాలైన సామాజిక వైరుధ్యాలకు తుదితీర్పు. నిజమైన మానవ మహాచరిత్రకు నాంది.

ఆశయం తారాజువ్వయై ఆశాంచలాల నంటుకొన్నప్పుడు
ప్రతిమనిషి కళ్లలో హృదయం పువ్వొత్తులై వెలుగురవ్వలు రాలుస్తున్నప్పుడు
ప్రపంచమంతా విష్ణుచక్రమై గుండెలో పరిభ్రమిస్తున్నప్పుడు
అణువణువులో మహోద్యమ శతఘ్నులు పేలుస్తున్నప్పుడు
క్షితిజరేఖచుట్టూ చైతన్యదీపాలు మాలలు కలకలలాడతై :
కంటి కంటికొక దీపం వెలిగి భువిదివిగా అవతరిస్తుంది :

"భవిష్యదద్దం" (Sic) గా కలల్నీ కామనల్నీ స్పష్టాస్పష్టంగా ప్రతిబింబించడం లోనేగాక, నేటి మనస్సుల వూగిసలాటల్నీ వూహపోహల్నీ చూపించడంలోకూడా ఈ గేయసంపుటి కృతకృత్యమైంది. అలంకార సంభారముండి, చమత్కారమూ వైచిత్రీ వుండీ. చివరకు శకటరేఫలు పోగుబడీ రామమోహనరావుగారి వచన గేయాలలో

వచనత్వమే ఎక్కువకావడం విచారకరం. అంత్యప్రాసలుగానీ, పాదాద్యక్షర నియమం గానీ ప్రాసప్రయాసగానీ లేనందువల్లనే ఇది ఏర్పడిందని అనుకోను. ఒక భావ చిత్రాన్ని అక్షరబద్ధం చెయ్యడంలో కవి చూపెట్టవలసినంత మోతాదుకంటె చాలా ఎక్కువగా సూక్ష్మాంశాలను చూపించబోయాడు కాబట్టి బలాపాదకం కావలసిన గుణమే వక్రించి బలహీనతకు ఆస్కారమిచ్చింది. అంతేగాక, "యొక్క", "చేత", "వలన" వంటి విభక్తి ప్రత్యయాలనూ, కర్మణి ప్రయోగాలనూ కవిత్వంలో హెచ్చుగానే ప్రవేశపెట్టి కవి తనను తానే అపచరించుకున్నారు. హృదయం, లేదా. గుండెలాంటి ఒకే ఒకమాటను ఎన్ని చిలవలు పలవలు కల్పించిందీ లెక్కగడితే, రామమోహన రావుగారి హృదయవాదమే గాక, ఆయన వచన కవిత్వంలోని మరొక బలహీనత తెలిసివస్తుంది. హృదయానికి పట్టవలసిందల్లా, దాన్ని తాకినప్పేటికి దూసుకుపోతున్నది. "అగ్నిగీతం" కావలసిందల్లా, పాఠకుని "ఆత్మాకాశాన అమృతస్పర్శగా" దూసుకు పోతున్నది. తాత్వికంగా రామమోహనరావుగారి సాంఘిక ప్రమేయం సౌజన్యమహిత మైతే కావచ్చుగాక, ప్రగాఢం కానందువల్లనే ఈ గుండెను పట్టి ఒప్పించలేని తనం ఆయన కవిత్వాన్ని గ్రహణంలా ఆక్రమించిందనిపిస్తుంది. నిబద్ధతకూ అనిబద్ధతకూ మధ్య సంచరిస్తున్నందుచేత, గుండె వండిన ప్రపంచమంత విశాలమైన కలలో అంత వేదన ఉన్నంతగా ఉద్బోధ లేదు.

వణికిపోయే కలం చివరకారే అక్షరాలలో తలదాచుకోవడమే తప్ప
నా గుండెతో సమాజాన్ని వెలిగించి,
సరికొత్త కాంతిని చూడలేకున్నాను।

'సంధ్యాజ్వాలను' పడమటి నుంచి తూర్పుకి మార్చడానికి రామమోహనరావు గారుకూడా పూనుకోడం మంచిది.

# చైతన్యమే జ్వాల

—టంకశాల అశోక్

'చైతన్య జ్వాల' మంచిపేరు. అయితే ఇందులో ఉన్న 31 మంది కవులలో కొందరు చైతన్యం జోలికి పోలేదు.

ఇందులో ఉన్న కవితలలో కొత్తపల్లి రవిబాబు, జి. సత్యనారాయణ, టి. ఎల్. కాంతారావు, జె. ఎస్. ఆర్. కె. ప్రసాదరావు, రాధాకృష్ణ, చిలుకూరు వెంకటప్పయ్య, సి. బాబూరావు, బూదరాజు శ్యామసుందర్, వి. వి. కృష్ణారావు, స్వర్ణరాజ హనుమంతరావు, రీ.నా. ల కవితలలో చైతన్యంతోపాటు నిజాయితీ కనిపిస్తున్నది.

రాధాకృష్ణ రాసిన 'దోపిడి దొరలు' స్వర్ణరాజ హనుమంతరావు రచన 'గాడిదలు కావాలి' ప్రత్యేకంగా పేర్కొనదగ్గవి. గుబ్బిట దుర్గాప్రసాద్ 'ఖరీదు తొలగింది'లో నిజాయితీ ఉందికాని చైతన్యంలేదు. దేశం బలహీనపడుతున్నదన్న విషయాన్ని ఆయన జాతిదృష్టితో చూస్తున్నాడు. ఎవరో దాడిచేసినప్పుడు, మిత్రులనుకున్నవారు తోడ్పడ లేదు. అణ్వాయుధ ప్రజాళికను గాంధీ పేరుమీద దాటేసి పొరపాటుచేసాం. "శక్తి వంతమైన జాతి/ శక్తిపూరితమైన నాతల్లిని/ నిరంతరం సేవించాలి" అంటున్నాడు.

దేశం బలపడాలనడం సరైనదేగాని, అది జరగాలంటే ముందు దేశం బాగుపడా లన్న సంగతి గుర్తుంచుకోవాలి. దేశం బాగుపడకపోవటానికి కారణం అణ్వాయు ధాలు లేకపోవడం కాదు. అణ్వాయుధాలతో దేశం రక్షించబడడం ఒకవేళ నిజమైనా, ఎగుడు దిగుడు సమాజం ఉన్నంతకాలం ఆదేశం పెత్తందార్ల చేతులోనేఉండి బలహీనం గానే ఉంటుంది. కాబట్టి, ఈవిధంగానే మనం ఆలోచించవలసి ఉంటుంది.

జి. సత్యనారాయణ "బాపూ! ఒక్కసారి జన్మించు" అని కోరడం అర్థంలేని ఆర్తనాదం. గాంధీజీకి నివేదనలు చేసి ప్రార్థించడాన్ని ఎవరు కనిపెట్టారోకాని, ఇదొక అంటు జాడ్యమైపోయింది ఇట్లా ఆయన పేరుమీద కొన్నిటన్నుల కాగితాల కవితలు వచ్చి ఉంటాయి. నీపేరుచెప్పి రాజకీయ నాయకులు ఇట్లాచేస్తున్నారు అనే వీరయినా కనీసం ఆయన చెప్పిన ప్రతిఘటనోద్యమం చేపడతారా అంటే అదీలేదు— ఉత్తపిరికి అరుపులు తప్ప.

'ఆధునిక సాహిత్యం- ఈనాటిస్థితి' పేరుతో కుందుర్తి ఈపుస్తకానికి ఒక దీర్ఘోపోద్ఘాతం రాసారు.

అందులో— సమాజాన్ని మార్చడానికి ఉద్దేశించిన ఉద్యమాలతో సిద్ధాంతాలతో ముడిపడిన రాజకీయాల జోలికిపోవడం అంటే యదార్థజీవిత సమస్యల జోలికిపోవడమని స్వయంగా అన్న కుందుర్తి— యదార్థజీవిత సమస్యలలో సాహిత్యం తలమునకలయినపుడు, సాహిత్యం జీవిత సమస్యలతో తలమునకలయిందనే అనుకోకుండానే అది రాజకీయాలతో తలమునకలయిందని ఎందుకు అనుకుంటున్నారు? అభ్యుదయాన్ని అగమ్యగోచరం చేసిన సంకరసంస్థ యొక్క నిష్ప్రయోజకత్వాన్ని గుర్తించడంవల్లనే కొందరు రచయితలు వేరుపడి విప్లవం కావాలన్నారన్న నిజాన్ని గమనించకుండా, అట్లా విప్లవం కావాలనే రాజకీయపార్టీ ఒకటుంది కనుక దానికి అనుబంధంగా వీళ్ల తయారయారన్న ప్రచారాన్ని కొందరు దివాంధులుచేస్తే చేసారుకాక, కుందుర్తికూడా ఇది నిజమేనన్న భ్రిమలోపడి భయపడడంలో అర్థంలేదు. అరసం, విరసం అన్న పదాలు అర్థస్ఫూర్తిలో బాగులేవు కనుక తాము దూరంగా ఉన్నామని కుందుర్తి అంటున్నారుగాని అసలు అట్లా దూరంగా ఉండటానికి కారణం ఈభయమే. అరసం పుచ్చిపోయిందన్న సత్యం తెలిసిన కుందుర్తి ఎలాగూ అందులోచేరరు. పోతే 'విరసం'లో చేరితే పార్టీకి అంటుల్లాచేసి ప్రచారం చేస్తారేమోనన్న దుశ్శంక।

విప్లవ చరిత్రలు ఆయనకు బాగా తెలుసు. భారతదేశంలో విప్లవం అవసరాన్ని కూడా వివరించవలసిన అవసరంలేదు. అటువంటప్పుడు, ఆలోచించగలవారు విప్లవం అవసరాన్ని గుర్తించి స్వయంగా మాట్లాడుతున్నారేకాని, ఏ పార్టీయో అన్నదనికాదు అని కుందుర్తి ఎందుకనుకోరు। పార్టీ అన్నా, అనకున్నా ఎపుడేది అవసరమో మేధావి వర్గం గుర్తించి చెప్తూనే ఉంటుంది. ఆ మాటను సమర్థించే పార్టీయో, సంస్థో ఉండవచ్చుగాక, ఉండకపోవచ్చుగాక— ఆ విషయంతో మేధావి వర్గానికి సంబంధం లేశమే. ఒకవేళ అటువంటి పార్టీ లేక సంస్థ ఉండడం జరిగితే దానికి ఈ వర్గం ఉపగ్రిహం ఎట్లా అవుతుందో తల రాతికేసికొట్టుకున్నా బోధపడదు, ఆపార్టీ లేక సంస్థ తమతమ ప్రయోజనాలకొరకు మర్నాడు మరోవేషం వేస్తే రచయితలుకూడా ఆవేషం వేయడం ఎప్పుడూ జరుగదు అట్లాంటి వాళ్లంటే వారు పార్టీ బాకాలే ఔతారుకాని కొంత సొంత మెదడుగల రచయితలు కారు, కాబోరు.

'విరసం' ఖచ్చితంగా స్వీయ వ్యక్తిత్వం, ఆలోచనాగల వారిసంస్థ.

అసమంజస భీతితో వెనుకముందులాడే కుందుర్తి వంటివారు ఇది గమనించాలి; విరసం పై దురభిప్రాయాలు తొలగించుకోవడం, దుష్ప్రచారం చేసేవారి కుచ్చిత బుద్ధిపై గొడ్డలిపెట్టు వేయడం జరగాలి.

ఆఁ! ఒకవేళ ఇదంతా గ్రహించగలిగినా, ధైర్యంతో ఆమార్గంలోకి రాలేక, విరసం పార్టీసంస్థ అన్న సాకుపెట్టి తప్పుకునే వారయితే అదివేరు....

---

చైతన్యజ్వాల (వచన కవితా సంకలనం)
ఆంధ్ర సారస్వత సమితి, మచిలీపట్టణం
ప్రతులకు: ఆంధ్ర సారస్వత సమితి,
27/259, ఫోర్టురోడ్డు, మచిలీపట్టణం
వెల: రూ. 2–50 పేజీలు: XVI+64

---

"పూర్వకాలంలో ఏవిధంగా మతానికీ సాహిత్యానికీ సంబంధం ఉండేదో, ఆ విధంగా రాజకీయాలకు, సాహిత్యానికీ యీనాడు సన్నిహితమైన సంబంధం ఉండక తప్పదు ఒక్క రాజకీయాలేకాకుండా సమాజం మార్పుకు ఉద్దేశించిన యితర ఉద్యమాలతోకూడా సాహిత్యం తెగతెంపులు చేసుకోవడం సాధ్యంకాదు". అని మళ్ళీ తామే అంటున్న కుందుర్తి నిర్ణయాలు, సంశయాల మధ్య దోబూచు లాడుతున్నట్లు కనిపిస్తున్నది.

# కందుకూరి వీరేశలింగం డైరీలు - లేఖలు

కొడవటిగంటి కుటుంబరావు

[సంకలనకర్త : అక్కిరాజు రమాపతిరావు (మంజుశ్రీ) ; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ : విజయవాడ. వెల : మూడు రూపాయలు]

పశుపక్ష్యాదులు తమ భవిష్యత్తుకు సరి అయిన పునాదులు వేసుకోలేవు, గతం నుంచి నేర్చుకోలేవు. ఈ రెండు విషయాలలోనూ ప్రకృతితోడ్పాటు తప్ప మరేదీ వాటికిలేదు. మేధస్సుగల మానవుడికి ఈ రెండు శక్తులూ ఉన్నాయి. వీటితోబాటు సమాజ శక్తులుకూడా ఉన్నాయి. కాని వాటిని మనం ఉపయోగించుకోవటం లేదు. అసలు ఉపయోగించుకోక మనం పశుపక్ష్యాదుల లాగైనా బతకటంలేదు. గతం నుంచి పనికిమాలిన విశ్వాసాలను ఉపయోగించుకుంటున్నాం; సామాజిక శక్తులను వ్యష్టిలాభానికి వాడుకుంటున్నాం. సామాజికజీవితం శిథిలం కావటానికీ, వ్యక్తులు పశుప్రాయులై పోవటానికీ ఈ పరిస్థితి చక్కగా ఉపకరిస్తుంది.

తనకాలపు జీవితాన్నిచూసి ఆందోళనపడి, దాన్ని మార్చటానికి తన జీవితాన్ని ధారపోసిన మొదటి ఆంధ్రుడు కందుకూరి వీరేశలింగం. ఆయన సంఘసేవా కృషి బహుముఖమేకాదు, సర్వతోముఖమైనది. ఆ కృషిని ఆయన విప్లవ దీక్షతోనే చేసినప్పటికీ అది సంస్కారంగానే నిలిచిపోయింది. ఆయన సమాజంలోని వర్గతత్వాన్ని గమనించలేదనటానికి లేదు. అధికారమూ ధనమూ ఎలా దుర్వినియోగ మవుతున్నదీ ఆయనకుతెలుసు కాని అన్నిటితోనూ ఆయన రాజీపడుతూ తనకృషినికొనసాగించాడు.

అందుకు ఆయనను తప్పుపట్టనవసరం లేదేమో. ఎందుచేతనంటే, విప్లవపరిణామాలకు సంస్కరణోద్యమాల ద్వారానే దోహదం కలుగుతుంది. విప్లవానంతరం కూడా అంతులేని సంస్కరణలు అవసరమవుతాయి.

వీరేశలింగంగారు జాతీయోద్యమాన్ని చిన్నచూపుచూసిన మాటనిజమే. దానికి కూడా అనేక కారణాలున్నాయి. జాతీయోద్యమం కార్యాచరణతోగాక నినాదప్రధానంగా సాగింది; వీరేశలింగంగారికి మాటలలో విశ్వాసంలేదు, పనిజరగాలి. ఆయనదృష్టిలో

శీలంలేని వారంతా జాతీయోద్యమం చాటున నాయకులుగా పైకి వచ్చారు; ఆయన వ్యక్తులశీలానికి ఇచ్చిన ప్రాముఖ్యం మరిదేనికీ ఇయ్యలేదు. అదీగాక, మనజాతి ఎంతో సంస్కరించ బడితేనేగాని స్వపరిపాలనకు అర్హంకాదని ఆయన నమ్మాడు. మరొక సంగతి ఏమంటే జాతీయోద్యమం బ్రిటిషు పరిపాలనను తుదముట్టించటానికి సాగింది; కాని వీరేశలింగం గారికి, బ్రిటిషు పాలనవల్ల మన సమాజంలోని కుళ్ళుకాలన కావటానికి మార్గం ఏర్పడిందన్న విశ్వాసఉండేది. ("It is admitted by one and all that western lore has worked wonders among the natives of India... that English education has rendered natives more refined in their manners, has dispelled the mist of superstition... and has considerably developed their moral calibre whenever it is properly imported."— వివేకవర్ధని, 1875 అక్టోబరు) అంతేగాక. వీరేశలింగంగారి సంస్కరణోద్యమాన్ని. దానివల్ల లాభం పొందదగినవారు సైతం ప్రతిఘటిస్తూఉంటే, అధికారులు ఆయనకు సాయపడ్డారు. ఇంగ్లీషు చదువు మూఢాచారాలను వ్యతిరేకించిందని దాన్ని ఖండించినవారు "దేశభక్తులు" ఆయారు।

నాగరిక జాతులవారు మధ్యమరకం కీర్తిగలవారిని గురించి కూడా బోలెడంతగా వివరాలు సేకరిస్తారు, సాహిత్యం సృష్టిస్తారు. "ఆయన మహాపురుషుడు. చనిపోయి అర్ధశతమయింది. ఇంకొక దేశంలోనైతే, ఇంకొక జాతివారైతే ఈవిధంగా ఎప్పటికీ ప్రవర్తించి ఉండేవారుకారు", అంటున్నారు సంకలనకర్త.

వీరేశలింగంగారు సంస్కరణలు సాగించినంతకాలమూ సనాతనులు ఆయనమీద కత్తికట్టారు. కొంతకాలం గడిచాక ఆయనను అనుసరించినవారే ఆయనపై కత్తికట్టారు. ఆయన చనిపోగానే ఆయనను మరిచిపోవటానికి జాతీయోద్యమం సహాయపడింది. ఆయన పోయిన పాతికేళ్ళకి అభ్యుదయ రచయితలు తిరిగి ఆయనస్మృతిని పునరుద్ధరించేసరికి, అతితెలివిగాళ్లు ఆయనను "కామ్రేడ్ వీరేశలింగం" చేశారు।

వీరేశలింగంగారు స్థాపించిన సంస్థలు బూజుపట్టి ఉన్నాయి. ఆయన తలపెట్టిన సంస్కరణలన్నీ మొదటికి వచ్చాయి. ఆయన ప్రతిఘటించిన దురాచారాలు కొన్ని మరింత తీవ్రరూపంలో మనకళ్ళ ఎదట ఉన్నాయి. సంఘంలో విప్లవకరమైన మార్పులువస్తేనేగాని ఇవిపోవు. సామ్యవాదమూ, మార్క్సిస్టు తాత్వికదృష్టీ, విప్లవ వాదమూ ఈనాడు జీవితానికి అవసరం. ఇవి వీరేశలింగం గారిని స్పృశించనివే. అయినా ఈనాడుకూడా మనకు వీరేశలింగంగారి భావాలతోనూ, కృషితోనూ అవసరం ఉన్నది. విప్లవ పరిణామాలకుకూడా ఆయన ఆదర్శాలూ, కృషీ ప్రాతిపదిక కాగలవు.

ఏటా వీరేశలింగం స్మారక సభలు కొద్దిపరిధిలో జరుగుతున్నాయి. కాని వాటి ప్రభావం మన జాతిమీద ఎంతగా ఉంటున్నదీ చెప్పలేం. సాహిత్య అకాడమీవారు వీరేశలింగం గారిని పూర్తిగా విస్మరించలేదు. నార్లవారు వీరేశలింగం గారిపైన రచించిన మంచి పుస్తకాన్ని అకాడమీ ప్రచురించింది వీరేశలింగంగారు సృష్టించిన సాహిత్యంకన్నా ఆయనమీద విరివిగా సాహిత్యం వెలువడటం ఎంతైనా అవసరం. ఆకృషి దాదాపు ఏమీలేని సమయంలో ఈపుస్తకం రావటంకూడా గొప్ప విషయమే.

అయితే ఈపుస్తకం విలువ చాలా పరిమితమైనది. ఆయన డైరీలలో కొన్ని సంఘటనల తేదీలూ, ఆకాలపు ధరలూతప్ప పనికివచ్చే దేమీలేదు. ఉదాహరణకు, నెయ్యి వీశె రూపాయిన్నర అమ్మిన రోజుల్లో వీరేశలింగంగారు 45 వేల రూపాయల ఆస్తిని తెలుగువారి అభివృద్ధికి దానం చేశాడంటే అది ఈనాడు ఎంతపెద్ద మొత్తమో మనం ఊహించవచ్చు.

ఉత్తరాలలో వీరేశలింగంగారి మనస్తత్వం చాలా చక్కగా వ్యక్తమవుతుంది. నా కాయన ఆలోచనా విధానంపట్ల పక్షపాతం ఉన్నసంగతి దాచాను. ఆయన అనుక్షణమూ తనను భగవంతుడే కనిపెట్టి ఉన్నాడన్న ప్రగాఢ నమ్మకంతో నేనేకీభవించను గాని, ఆయన కార్యదీక్ష, నిరాడంబరతా మొదలైన గుణాలు ఎవరినన్నా ఆకర్షిస్తాయి. ఆయనలో ఆత్మాభిమానం ఉన్నదిగాని స్వాతిశయం లేదు. తనకు అంతులేని ధన సహాయం చేసిన వారిని సైతం. తప్పుచేస్తే నిర్మొహమాటంగా విమర్శించినవాడు. పాశ్చాత్యులలో మంచిని అభినందించినా. చెడ్డను స్పష్టంగా ఖండించినవాడు.

"నాకు తప్పులు లేవనను.... ఆక్షేపణలు సయుక్తికములైనచో వందన పూర్వకముగా నందుకొని.... సంస్కరించుకొనియెదను."

"నేను చేసిన యర్థమే సరియైనదనియు రెండవవారుచేసిన యర్థము సరియైనది కాదనియు దురభిమానముచేతనో ఏమో కాని నాకిప్పుడు తోచుచున్నది"

"తప్పులు పట్టుటలోను పరిహసించుటలోను నాకును కొంత సామర్థ్యముకలదు"

వీటినిబట్టి వీరేశలింగంగారి మనస్తత్వాన్ని 3–D లో చూడవచ్చు.

ఆయన ప్రతిగుణంలోనూ ఇలాగే మనకు "లోతు" కనబడుతుంది. సంస్కరణోద్యమంలో ఇంచుమించు యావద్భారత ఖ్యాతిసంపాదించిన వీరేశలింగం గారు ఉత్తరాలలో ఇలా రాయగలిగారు.

"సంస్కరణ మహాసభాధ్యక్షక పదవి వలదని మొదటచెప్పి.... స్నేహితులు పట్టుపట్టుటచేత.... తుదకెటులో సమ్మతించితిని. ఇప్పుడైనను ఈ గౌరవమునకు నే నర్హుడను కాననియె తలంచుచున్నాను". "సహాయకుల కొరతయె నన్ను బాధించు చున్నది. నా తదనంతరము వితంతు శరణాలయ మెట్లు జరుగునాయని విచారించు చున్నాను". "నాకాతిథ్య మొసగు మిత్రుడు నా పంక్తిని భోజనము చేయనక్కరలేదు." "ఈ ప్రపంచమున నే నేకాకిగా నుంటిననియు, ప్రాపంచిక ధోరణికల్గిన మన స్నేహితులు నన్ను వదలివేసిరనియు నేనప్పుడప్పు డనుకొనుచుందును". "మన యుద్యమము ధర్మముపైనను సత్యముపైనను ఆధారపడియున్నది"

వీరేశలింగంగారి స్వభావాన్ని సూచించటానికి ఈకొద్ది ఉత్తరాలనుంచి ఎన్ని ఉదాహరణలైనా చూపవచ్చును.

"నా పుస్తకములోని గుణములను శ్లాఘింపవలసిన పనిలేదనియు ... దోషములను మాత్రమే చూపవలసినదనియు వ్రాసియుంటిని". "పొగడ్తలెక్కువగాను పని తక్కువగాను చేయువారి నేనంత మెచ్చను." "నా తప్పులను శత్రువులు చూపినను కృతజ్ఞతతో స్వీకరించెదను."

వీరేశలింగంగారిలో ఎన్నో గొప్పగుణాలున్నప్పటికీ ఆయన తరచుగా భగవంతుణ్ణి నమ్ముకోవటం చిత్రంగా కనిపిస్తుంది. అనేకరకాల మూఢనమ్మకాలను ఖండించిన వాడుతానే మూఢవిశ్వాసాన్ని ప్రదర్శించటం మరీచిత్రం. 19-6-1913 న బెంగుళూరు నుంచి ఆయన కుందూరి వెంకటరత్నంగారికి రాసిన ఉత్తరంలో "భగవంతుడు తప్పక నాపక్షమున నున్నాడు. నిస్సంశయముగ నాకాతడు సాయముచేయుచున్నాడు." అంటూ, మందు సీసా మూత దానంతట అదే ఎగిరిపడ్డ ఉదంతం ఉదహరించాడు. మూఢవిశ్వాసాలన్నీ ఇలా పుట్టినవేకావా ?

"నా వెన్నో తప్పులున్నవి", అని బాహాటంగా ఒప్పుకునేవాణ్ణి తప్పుపట్టి లాభం లేదు. సమాజానికీ, దేశానికీ అంకితమైనవాడు ఎలా జీవించాలో, ఎలా పనిచెయ్యాలో, అవాంతరాలను ఎలా ఎదుర్కోవాలో ప్రతి ఒకడూ వీరేశలింగంగారి నుంచి నేర్చుకోవాలి. ఇంకా 15 సంవత్సరాలకు పోతాడనగానే ఆయన, "కొలది కాలములోనే నాకు మృత్యువాసన్న మగునని నేను తలచెదను," అని రాయసం వెంకటశివుడుగారికి రాశాడు. ఆయన ఆరోగ్యం అంత చెడ్డది. ఏక్షణాన అయినా మృత్యువు తనను ఎత్తుకు

పోతుందనుకుంటూనే ఆయన ఎంతో కృషి చేశాడు. అదే ఉత్తరంలో ఆయన "ఈ సంవత్సరాంతమునకు నాయప్పులన్నియు తీర్చివేయ గోరుచున్నాను. అప్పుడు నేను ... ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి తోడ్పడవలెను," అని రాశాడు.

ఆయన చేసిన ఆంధ్రవాఙ్మయాభివృద్ధి అందరికీ తెలిసినదే.

చాలా ప్రయాసపడి ఈ పుస్తకాన్ని తయారుచేసిన మంజుశ్రీగారు అభినంద నీయులు.

వంగవిప్లవ కవి :

# నజ్రుల్ యిస్లాం - జీవితం - సాహిత్యం

21వ శతాబ్దంలో పుట్టవలసిన నజ్రుల్ యిస్లాం 19వ శతాబ్దం ఆఖరి ఘడియల్లో పుట్టాడు. నజ్రుల్ పుట్టిన ఆరేళ్ళకు 1905 లో బ్రిటిష్ ప్రభుత్వం బెంగాలును రెండుగా చీల్చింది. తన సంస్కృతికోసం, తన ఔన్నత్యం కోసం ప్రపంచంలో అన్నిజాతుల కన్న ఎంతో వీరోచితంగా పోరాడే యీజాతిని రెండుగా చీల్చిన యీ కుతంత్రం నజ్రుల్ బాల్య జీవితంమీద చాలాగొప్ప ముద్రవేసింది. బంకిం చంద్రుని 'వందే మాతరం' రామమోహనరాయ్ సంస్కరణోద్యమం దేశాన్ని పురూత్రిత లూగిస్తున్న రోజులవి. నజ్రుల్ జీవితంలో వివేకానందుని ఉత్తేజపూరితమైన మతోద్యమ ప్రభావం కూడా వున్నది.

'ఖాజీ'లు మొగల్ వంశంలో జాగీర్‌దార్లు కాని నజ్రుల్ చిన్నతనం నుంచే దుర్భరమైన పేదరికాన్ని అనుభవించాడు. కుటుంబ పోషణకొరకు ఎన్నోతీర్ల చిల్లర ఉద్యోగాలు చేశాడు. ఊళ్ళల్లో జానపదగీతాలు పాడే బృందాలకొరకు పాటలు రాసి శృతులుకట్టేవాడు. చిన్నతనాన స్కూలుకు వెళ్ళే అదృష్టానికికూడా అతను నోచుకో లేదు. కాని పాటలు, నాటకాలు, నాటికలు ఊళ్ళల్లో తిరిగే నాటక బృందాలకు రాసి యివ్వడంలో మాత్రం చిన్నతనాన్నే మంచిపేరు తెచ్చుకున్నాడు. ఈ ప్రతిభచేత ఆకర్షితుడయి ఖాజీరఫీజుల్లాఅనే పోలీసు ఆఫీసరు యీయనను మైమేన్‌సింగ్ (తూర్పు బెంగాల్) కు తీసుకుపోయి అక్కడ స్కూల్లో ప్రవేశపెట్టాడు. అక్కడ చాలాకాలం వుండకుండానే స్వస్థలమైన బర్ద్వాన్‌కు వచ్చి నవీన్‌చంద్ర సంస్థలో చేరాడు. అక్కడ యిద్దరు ఆయన బాల్య జీవితంమీద గొప్ప ప్రభావం వేశారు. కుముద్‌రంజన్ మల్లిక్ అనే సుప్రసిద్ధ కవి ఆయన గురువు. విప్లవ జుగంతర్ పార్టీతో సంబంధం వున్న నిబారాన్ చంద్రఘటక్ ఆయనకు గురువు అయ్యారు. ఆయన బంధువయిన దుకూరీ బాలదేవి ఆయుధాల చట్టం (Arms act) కింద జైలుశిక్ష అనుభవించిన మొట్టమొదటి బెంగాలీ మహిళ. ఈమె ప్రభావంకూడా నజ్రుల్‌పై వున్నది. మిల్ట్రిలో ట్రైనింగ్ అయితే ఎప్పుడైనా దేశానికి వుపయోగపడవచ్చునని బెంగాలీ రెజిమెంట్‌లో అతను చేరిపోయాడు. నజ్రుల్ జీవితంలో రాజకీయ ప్రభావం యిట్లా ప్రారంభమయింది. ఆయన కప్పుడు 18 ఏండ్లు మాత్రమే.

కాని నజ్రుల్ ప్రధానంగా కవి. ఆయన మొదటి కవిత వంగీయ ముసల్మాన్ సాహిత్య పత్రికలో 1919 జులైలో అచ్చయింది. ఈ పత్రిక పేరులోనే ముసల్మాన్ అనే మాటవున్నది కాని సెక్యులర్ దృష్టిగల పత్రిక. ఈపత్రికకు తర్వాత ప్రముఖ కమ్యూనిస్టుగా పేరొందిన ముజఫర్ అహ్మద్ మేనేజర్‌గా వుండేవాడు. తర్వాత "ఖాజీ నజ్రుల్ యిస్లాం— స్మృతులు" అని ఆయన రాసిన పుస్తకంలో 'ముక్తి' అనే పేరుతో అచ్చయిన యీ మొదటి గేయం గురించిరాస్తూ నజ్రుల్‌కు బాల్యంనుండీ కొంత ఆధ్యాత్మికమైన ఆవేశం వుండేదని రాసాడు. ఈ గేయం తరువాత వరుసగా నజ్రుల్ కథలు రాశాడు. అందులో 'బైతార్‌దాన్' చాలా పేరుతెచ్చుకున్నది. అందులో ముఖ్యమైన పాత్రలు ఎర్రసైన్యంలో చేరినట్లు చిత్రించాడు. ఇది ఆరోజుల్లో కొందరు భారతీయ సైనికులు రాజకీయవాదులు ఎర్రసైన్యం (Red Army) లో చేరడందృష్టిలో పెట్టుకుని రాసిందన్నది సుస్పష్టమే. ఆయన తొలిరోజుల్లో పర్షియన్ నేర్చుకుని ఆ భాషనుండి ఎన్నో అనువాదాలుచేసాడు.

త్వరలోనే 49 వ బెంగాలీ రెజిమెంట్ రద్దయిపోయింది. 1920 లో నజ్రుల్ కలకత్తా తిరిగి వచ్చాడు. మాజీసైనికుడుగా నజ్రుల్‌కు ప్రభుత్వ ఉద్యోగం సులభంగా దొరికేదే. కాని ముజఫర్ అహ్మద్ సుప్రసిద్ధ కథా రచయిత శైలజానంద ముఖర్జి (నజ్రుల్ బాల్య మిత్రుడు) ఆయనను కలకత్తాలోవుండి సాహిత్యకృషి చేయమన్నారు. నజ్రుల్ సాహిత్యజీవితంలో ఫలవంతమైన దశ ఆయన 21వ ఏట ప్రారంభమయింది. హవల్దార్ ఖాజీ నజ్రుల్ యిస్లాం గేయాలూ, పాటలూ, కథలూ, వ్యాసాలూ, నాటకాలూ విరివిగా రాయడం మొదలుపెట్టాడు. అదేకాలంలో ఆయన పత్రికలకు రాజకీయాలపై వ్యాసాలు రాయడంకూడా చేశాడు. రాజకీయాలకొరకే బడివదిలి సైన్యంలో చేరిన నజ్రుల్ రాజకీయాల గురించి రాయడంలో ఆశ్చర్యంలేదు. ఆయన అది తన విధిగా భావించాడు.

1920 దేశచరిత్రలో సంక్షుభితమైన సంవత్సరం. 1919 లో పంజాబ్‌లోని జెలియన్‌వాలాబాగ్‌లో యితర ప్రాంతాల్లో జరిగిన దారుణ హింసాకాండలకు ప్రజలు కోపోద్రిక్తులై ఉడుకుతున్న రోజులవి. రాజ్యాంగ సంస్కరణలతో అసంతృప్తులై సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించిన రోజులు. కలకత్తాలో సమావేశమైన జాతీయ కాంగ్రెస్ యీ వుద్యమాన్ని ఆమోదించిన రోజులు. ఈ రోజుల్లో ముజఫర్ అహ్మద్ ప్రోత్సాహంతో ఫజ్లుల్‌హక్ ప్రారంభించిన నవయుగ్ అనే పత్రికకు

నజ్రుల్ ప్రధాన సంపాదకుడయ్యాడు. ఈ పత్రికలో ఆయన రాసిన సంపాదకీయాలన్నీ 'యుగవాణి' అనే పేరుతో తరువాత అచ్చయినవి. అచ్చయిందే ఆలస్యం నిషేధించబడ్డవి. ఆయనరాతల్లో అతివాద రాజకీయాలేకాక కార్మికుల్లో, రైతుల్లో తలయెత్తుతున్న తిరుగుబాటు తత్త్వంకూడా వుండేది. ప్రభుత్వం ఆ పత్రికకు ఎన్నో హెచ్చరికలు చేసి చివరకు డిపాజిట్‌గా పెట్టిన వెయ్యి రూపాయలు స్వాధీనం చేసుకున్నది. పత్రిక కష్టాల్లోపడ్డది. మళ్ళీ రెండువేల రూపాయలు డిపాజిట్ చేస్తేగాని పత్రిక ప్రారంభంకాలేదు. కాని ఫజ్రుల్‌హక్, కొంతమంది మిత్రుల ఒత్తిడివల్ల పత్రిక కంఠాన్ని తగ్గించాడు. ఫలితంగా నజ్రుల్ ఆ పత్రిక ఒదిలాడు.

'నవయుగ్'కు రాస్తున్న రోజుల్లోకూడా నజ్రుల్ ఎన్నోకవితలు రాసాడు. టర్కీ స్వాతంత్రోద్యమ నిర్మాత అయిన కమాల్‌పాషామీద ఓకవిత రాశాడు. దేశదేశాల్లో వచ్చిన రాజకీయ వికాసం నజ్రుల్‌ను ఉత్తేజపరిచింది. ఈ రోజుల్లోనే ఎంతోమంది సుప్రసిద్ధమైన రచయితలతో ఆయనకు పరిచయమూ, స్నేహమూ ఏర్పడ్డాయి. సాంఘిక సమానత్వం మీద కార్మికవర్గ పోరాటాల మీద మొట్టమొదటరాసిన సత్యేంద్ర నాథ్‌పట్ల నజ్రుల్‌కు అనన్యమైన ప్రేమవుండేది. స్వాతంత్ర్యేచ్ఛ ఆయన శ్వాస. బంధీవి గురించి రాస్తూ

"ఈ అరుణోదయ కాలాన  
నేనేమి వింటున్నాను.  
ఖైదీలకు తగిలించిన సంకెళ్ళ  
చప్పుడులో స్వేచ్ఛా స్వాతంత్ర్యాల సవ్వడి వింటున్నాను!  
ఎవ్వరు వాళ్ళు చిమ్ముతున్నారు  
జైళ్ళలో స్వేచ్ఛా చిరుహాసాలు"

ఇట్లా కవిత మొత్తం ఖైదీలు స్వాతంత్ర్యంకోసంచేస్తున్న మార్చింగ్ ప్రతిధ్వనిలా సాగుతుంది.

ఈ కవిత, రాట్నం, సత్యమంత్రం యింకా మరికొన్ని కవితలు తుఫాన్ అనే పెద్దకవిత అన్నీకలిసి బిషేర్‌బన్షీ ( విషమురళి ) అనే పేరుతో పుస్తకంగా వచ్చాయి. ప్రభుత్వం నిషేధించింది.

దేశబంధు చిత్తరంజన్‌దాస్ బంగ్లార్ కథ అనే దినపత్రిక పారంభించాడు. ఆ పత్రికకోసం దాస్ భార్య బసంతదేవి కోరికపై నజ్రుల్ ఒక కవిత రాసాడు.

"జైలు యినపగేట్లను విరగ్గొట్టండి
రక్తంతో తడిసి
సంకెళ్ళ పూజకొరకు తయారుచేసిన
రాతి విగ్రిహాలను ముక్కలు ముక్కలు చేయండి
ఓ ఈశాన్య యువదూతలారా!
మీ యుగగీతం పాడండి.
యజమాని ఎవడు, ఎవడు రాజు
స్వేచ్ఛను శిక్షించే వాడెవడు
సంకెళ్లలేని సత్యాన్ని శిక్షించే వాడెవడు"

ఇట్లాంటివి పాడుకోవడానికికూడా వీలయ్యే బాణీల్లో ఆయన రాశాడు. 'భంగేర్ గాన్' (విలయగీతం) అనే యీ గీతం పేరుతోనే వచ్చిన పుస్తకాన్ని ప్రిభుత్వం నిషేధించింది— కాని నజ్రుల్ సృజన ఆగలేదు, నజ్రుల్ కవితా శిఖరం 'విద్రోహి'. 'ముస్లిమ్ భారత్' అనే పత్రికకు యిచ్చిన యీకవితను 'బిజోలి' అనే పత్రిక మొదట ప్రచురించింది. దీనికి సుప్రసిద్ధ విప్లవకారుడు, అరవింద్‌ఘోష్ తమ్ముడు బరీంద్రి కుమార్‌ఘోష్ సంపాదకుడు. రవీంద్రుడు, శరత్‌బాబు నజ్రుల్‌ను గొప్ప కవిగా కీర్తించారు.

కవిగా సాహిత్యరంగంలో స్థిరపడి నజ్రుల్ మళ్ళీ రాజకీయాల్లోకి, రాజకీయ పత్రికా రచనలోకి ప్రవేశించాడు.

1922 లో నజ్రుల్ చాలాకాలం కొమిల్లాలో (తూర్పు బెంగాల్) గడిపాడు. అక్కడ ఆయన 'ప్రళయోల్లాస్' అనే కవిత రాసాడు. ఇది రష్యన్ విప్లవం గురించి రాసిన గీతం. 'సేవక్' అనే పత్రికలో పనిచేయడానికి నజ్రుల్ కొమిల్లానుండి తిరిగి వచ్చాడు. ఈ పత్రికలో రాస్తూనే 1922 ఆగస్టు 12 న నజ్రుల్ 'ధూమకేతు' అనే రాజకీయ వారపత్రికను ప్రారంభించాడు. ఈ పత్రికను ఆహ్వానిస్తూ రవీంద్రుడు

"రా (ధూమకేతు) రా
వేగంగా రా
చీకటిమీద నిప్పుల వంతెన నిర్మించు
ఈ దుర్భర దినాల శిఖరాగ్రాన
నీ విజయాన్ని ఎగరెయి.
నీ సాహసం గురించి యింకా కళ్ళుతెరవని
వాళ్ళ గుండెల్ని విభ్రాంతి పరుచు"

అన్నాడు ఇది నిశ్చయంగా నజ్రుల్ గురించి రవీంద్రునికున్న అభిప్రాయం.

శరత్‌బాబు కూడా సందేశం పంపుతూ నజ్రుల్‌ను 'స్నేహితుని గురించిగాని, శత్రువును గురించిగాని సత్యమే పలుకు' అని వెన్నుతట్టాడు. ఈ పత్రిక విప్లవ చేవ మధ్య తరగతి విద్యావంతులమీద గొప్ప ప్రభావాన్ని వేసింది. సహాయ నిరాకరణోద్యమాన్ని మెచ్చుకున్నా నజ్రుల్ అహింసా సిద్ధాంతం పట్ల అంత సుముఖంగా లేడు. ఆయన వస్తుతః విప్లవవాది. విప్లవోద్యమం, సహాయ నిరాకరణోద్యమానికి ఒక అవకాశం యిచ్చి చూడడానికి తాత్కాలికంగా ఆగిపోయిందని అతడు భావించాడు. అందుకే 'ధూమకేతు' పత్రిక భావవీథిలో ఆ విప్లవ చేవను కాపాడడానికి రాపాడింది. చాలామంది విప్లవకారులు యీ పత్రికతో క్రియాత్మకమైన సంబంధం పెట్టుకున్నారు. నజ్రుల్ యిస్లాం రాజకీయ– సాహిత్య జీవితంలో 'ధూమకేతు' ఒక నిర్ణయాత్మకమైన దశ. బ్రిటిష్ పరిపాలననుండి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరిన పత్రిక. అటువంట ప్పుడు ప్రభుత్వంతో కష్టాలురాకుండా ఎట్లావుంటాయి. 'ఆనందమాయేర్ ఆగమనే' అనే గీతం యీ పత్రికలో రాసినందుకు ప్రభుత్వం నజ్రుల్‌ను అరెస్టు చేసింది. 'ఆనందమయి' దుర్గ. శరత్ ఋతువులో బెంగాలీలు గొప్పగా కాళీ ఉత్సవాలు చేసు కుంటారు కవి యిది నెపంగాతీసుకుని ఆ దేవితో ఈ భూమిమీదికి ప్రళయనృత్యంతో దిగివచ్చి హిపాక్రసీని, పిరికితనాన్ని తుడిచేసి సిరాజ్, టిప్పుసుల్తాన్, మీర్‌ఖాసీం, ఝాన్సీరాణీల రక్తాన్ని తన పుత్రుల్లో నింపమని కోరుతాడు. ఈ గేయం కొరకు నజ్రుల్‌పై రాజద్రోహ నేరాన్ని ఆరోపించారు. ఆయనకు ఒకటిన్నర సంవత్సరాల కఠిన కారాగార శిక్ష 1923 జనవరిలో వేశారు. ఈ సందర్భంలో నజ్రుల్ చేసిన వాదన 'రాజబందీర్ జబన్‌బందీ' (ప్రభుత్వ ఖైదీ వాదన) అనే పేరుతో పుస్తకంగా వచ్చింది. రవీంద్రుడు ఈ రోజుల్లో రాసిన 'బసంత్' అనే నాటకాన్ని నజ్రుల్‌కు అంకితం చేశాడు. రాజకీయ ఖైదీగా నజ్రుల్‌కు జైల్లో ప్రత్యేకమైన సదుపాయాలు కల్పించాల్సివుండె. కాని ఆయనను మామూలు ఖైదీలా చూడడానికి హుగ్లీజిల్లా జైలుకు అతడ్ని పంపించారు. నజ్రుల్ నిరాహారదీక్ష పూనాడు. బయట ప్రజల్లో గొప్ప అలజడి రేగింది. ఠాగూర్‌కూడా నిరాహారదీక్ష విరమించమని ఆయనకు టెలిగ్రాం యిచ్చాడు. కాని జైలు అధికారులు అది అతనికి యివ్వలేదు. అయినా ప్రభుత్వం ప్రజల ఆందోళ నకు తలవంచక తప్పలేదు. ఆయనను బెర్హాంపూర్ జైలుకు ప్రత్యేకఖైదీగా మార్చారు.

నజ్రుల్ కవితా సంకలనం 'అగ్నివీణ' 1922 లో అచ్చయింది. ఈ పుస్తకం విప్లవవాది బరీంద్రకుమార్ ఘోష్‌కు అంకితమయింది. దీనికి సుప్రసిద్ధ చిత్రకారుడు అవనీంద్రనాథ్ ఠాగూర్ కవర్ డిజైన్‌వేశాడు.

ఏప్రిల్ 1921 లో ప్రమీలాసేన్‌గుప్తా అనే హిందూకన్యను నజ్రుల్ వివాహం చేసుకున్నాడు. ఈ మతాంతర వివాహంపట్ల కొంతమంది అతన్ని నిందించారు. కాని ఆయన పట్టించుకోలేదు. తొందరలోనే మళ్ళీ అతడు రాజకీయాల్లోకి దూకాడు. 'కార్మిక స్వరాజ్‌పార్టీ' (తరువాత యిదే వర్కర్స్ అండ్ పీజెంట్స్ పార్టీగా మారింది) స్థాపనకు యితడు తోడ్పడ్డాడు. పేరునుబట్టే, ధూమకేతు కాలంలో మధ్యతరగతి విప్లవ చేవతో ముడిపడినట్టుకాక, ఈ కాలంలో నజ్రుల్ అలగా జనంలోకి వచ్చినట్లు తెలుస్తుంది. 'లంగల్' అనే పత్రికకు నజ్రుల్ డైరెక్టర్ అయ్యాడు. ఇందులో వరుసగా ఆతడు 'సామ్యవాది' అనే కవితలు రాశాడు. ఈ కవితల్లో సనాతనత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు, పీడితుల హక్కులకోసం పోరాటం, మతంలోని అమానుషత్వం ఆయన గొప్పగా చిత్రించాడు. ఇదే పత్రికలో 'కృషికేర్‌గాన్' (రైతుపాట) కూడా రాశాడు. అఖిల బెంగాల్ ప్రజాసమావేశంలో ఆయన 'శ్రమకేర్‌గాన్' (శ్రామికగీతం) ఆలపించాడు. 'ఖండారీ హోషియార్' (చక్రధారీ హోషియార్) అనే ఆయన గీతం యీనాటికి బెంగాల్‌లో కోరస్‌గీతమై ప్రతిధ్వనిస్తున్నది. 1925 లో కృష్ణనగర్‌లో ఆయన చాలాకాలం గడిపి రాజకీయ, సాంఘిక కార్యకలాపాలెన్నిట్లోనో పాల్గొన్నాడు కృష్ణనగర్‌లో కష్టజీవుల కొరకు ఒక రాత్రి పాఠశాల నడిపాడు. దేశానికి డొమీనియన్ స్టేటస్ యివ్వాలని కోరిన కొందరు రాజకీయ నాయకుల వాదనల గురించి ఆయన కొన్ని హాస్యగీతాలు రాశాడు తరువాత అవి 'చంద్రబిందు' అనే పేరుతో అచ్చయి నిషేధించబడ్డవి. బెంగాల్‌లో ఠాగూర్ తరువాత రెండు ఉద్యమాలు ప్రబలినవి. అవి 'కలి- కలం' (కలము- సిరా), 'ప్రగతి'. మొదటిది కలకత్తాలో రెండవది ఢక్కాలో ప్రారంభమయినవి. ఈ ఉద్యమాలను ప్రతిబింబించే 'కల్లోల్' అనే పత్రికలో అతడు రాసేవాడు. ఆ పత్రికలో ఆయన రాసిన కవితల్లో 'దారిద్ర్య' గొప్ప కవిత. 'లంగల్' స్థానంలో పారంభించబడిన 'గణవాణి' అనే పత్రికలో కమ్యూనిస్టు యింటర్నేషనల్‌ను అనువదించి ప్రచురించాడు. కృష్ణనగర్‌లో వుండగానే నజ్రుల్ 'కుహేలిక', 'మృత్యుక్షుధ' అనే రెండు నవలలు రాశాడు. ఇందులో విప్లవ ధర్మానికీ వ్యక్తికీ మధ్యవుండే మానసిక సంఘర్షణను చిత్రించాడు. కుహేలిక మొదటి భాగం 'ఝిలీమిలీ' అనే నాటిక 'సేతుబంధ' అనే మరో రచన'నవరోజ్' అనే బెంగాలీ మాస పత్రికలో (1927) అచ్చయినవి ఈ పత్రికను బినోజిర్ అహ్మద్ స్థాపించాడు. ఇతడు టెర్రరిస్టు ఉద్యమంలో పాల్గొన్న కవి. ఈ పత్రిక 5 నెలలకే ఆగిపోయింది. కాని బినోజిర్ అహ్మద్ ఒక వీరగాథగా మిగిలిపోయాడు.

1926 లో కలకత్తాలో మత కలహాలు పెచ్చుపెరిగినవి. నజ్రుల్ ఎంతో బాధపడి పోయాడు వీటిగురించి గణవాణిలో అతను రాసిన కవితలు 'ఫణిమానష' అనే పేరుతో, ఆయన రాసిన వ్యాసాలు 'రుద్రమంగల్' అనే పేరుతో పుస్తకరూపంలో అచ్చ యినవి ఈకాలంలోనే 'ఛాయానట్', 'పూబేర్‌హవా', (తూర్పుగాలి), 'సామ్యబాది', 'సర్వహారా' (శ్రమజీవి), 'జింజీర్' (సంకెళ్ళు), 'సంధ్య' అనే ఆయన కవితా సంకలనాలు వెలువడ్డవి. 'దుర్దినేర్ యాత్రీ' అనే వ్యాసాలు, పిల్లలకొరకు రాసిన 'జింగేఫూల్', 'సాత్‌భాయి చెంపా' అనే కవితా సంకలనాలు 'ఝిల్లీమిల్లీ', 'పుతులేర్ బియా' (బొమ్మ పెండ్లి) అనే నాటికలు, 'బుల్‌బుల్', 'చోకేర్‌చాతక్', 'నజ్రుల్‌గీతిక' అనే పాటల పుస్తకాలు అచ్చయాయి.

నజ్రుల్ గీతాలన్నీ సంపుటాలుగా వేసిన మొదటి సంపుటాన్ని (సంచిత) రవీం ద్రునికి అంకితం చేశాడు.

1929 లో నజ్రుల్‌కు కలకత్తాలో పౌరసన్మానం జరిగింది. ఆసభకు సుప్రసిద్ధ శాస్త్రవేత్త ప్రఫుల్లచంద్రరే అధ్యక్షత వహించాడు. ఆ సభలో సుభాస్ చంద్రబోస్ నజ్రుల్‌కు, గుండెల్ని పిండే, రక్తాన్ని వుడుకెత్తించే, శ్వాసల్ని వుసిగొల్పే ఆయన గీతాలకు జోహార్లు అర్పించాడు.

1930 లో ఒకపక్క కొడుకు బుల్‌బుల్ మరణావస్థలో వుండగా నజ్రుల్ పర్షియన్‌నుండి 'రుబాయతెహాఫీజ్' అనువదించాడు. 'ప్రళయశిఖ' అనే కవితా సంకల నాన్ని వెలువరించాడు. ఈ సంకలనంలోని 'నవభారతేర్ హల్దీఘాట్' అనే కవితలో 1916 లో ఒరిస్సాలోని బాలసోర్‌లో బ్రిటిష్ పోలీసుకు 'బాగాజితీన్' అనే జితేంద్ర నాథ్ ముఖర్జీ, అతని విప్లవానుచరులకు అయిన చరిత్రాత్మకమైన పోరాటాన్ని వారి బలిదానాలను వర్ణించాడు. ఈ పుస్తకం నిషేధించబడ్డది నజ్రుల్‌కు 6 నెలల శిక్షపడ్డది. ఈ దశాబ్దమంతా కూడా నజ్రుల్ జీవితం విశ్రాంతిలేని సాహిత్య రాజకీయ కార్యకలా పాల్లో గడిచిపోయింది. సమకాలీన వంగరచయితల్లో తన దేశస్వాతంత్ర్యం కొరకు యింత యిదిగా ఆరాటపడి పోరాడినవాళ్లులేరు.

నజ్రుల్ యిస్లాం రాజకీయ రచనలకొరకు ప్రజలెంత ఉత్సాహంతో ఎదురు చూచేవారో సమకాలీన రచయితలు కూడా గమనించారు. ముఖ్యంగా 'ధూమకేతు' కొరకు ప్రతివారం ప్రజలు వందలసంఖ్యలో పేపర్‌స్టాల్స్ దగ్గర గుమికూడేవారు. అందుకే బ్రిటిష్ ప్రభుత్వం వీటిని నిషేధించడమేకాక నాశనం చేసింది. చాలా కొద్ది

కాపీలుమాత్రం ఎక్కడో దక్కిపోయాయి. ఆయన రచనలు కేవలం ఆవేశాన్ని కలిగించేవి మాత్రమేకావు. ఆవేశంవుండేది. దానితోపాటు ప్రయోజనంపట్ల తీవ్రదృష్టి, హేతువాదం స్పష్టంగా కన్పించేవి. చిత్తశుద్ధికలవారు మాత్రమే దేశవిమోచన సాధించ గలరని ఆయన నమ్మాడు. ఎంతోమంది ప్రజలు అహింసా ఉద్యమంలో దానిలో విశ్వాసం లేకుండా చేరా‌ని వాళ్ల ఆత్మవంచన, నైతిక బలహీనతలకు లోనయ్యారని రాస్తూ 'దేన్నైనా నేను నమ్మితే తప్ప స్వీకరించను' అని రాసాడు. నజ్రుల్‌కు అహింసోద్యమం పట్ల గురిలేదు. అట్లాగే స్వాతంత్ర్యోద్యమం మతం పాత్రిపదికగా నడుప డాన్నికూడా ఆయన గర్హించాడు. "బానిసలకు మతమేమిటి" అని ప్రశ్నించాడు బానిసత్వమే మతం, దాన్నించి విముక్తిసాధించాలి. యువకులు జీవన పోరాటానికి ప్రాధాన్యం యివ్వాలికాని మతబోధలకు కాదుఅన్నదే ఆయన మతం. చెడును నాశనం చేయడానికి సర్వస్వాన్ని, ప్రాణాన్నీ త్యాగం చేయాలన్నదే నజ్రుల్ పిలుపు. ఆయన శైలి ఆయన భాషలోని బలం ప్రజా హృదయాలమీద పరుసవేదిలా పనిచేసినవి. యువతీ యువకులమీద ఆయన రచనలు సమ్మోహనాస్త్రంలా పనిచేసినవి

ప్రపంచ సాహిత్యం గురించి రాస్తూ సమకాలీన సాహిత్య ధోరణులను 1. భావ కవిత్వం 2. మానవ సమస్యలపట్ల స్పందించడమేకాని తిరుగుబాటుతత్త్వంలేని కవిత్వం 3. కర్తవ్యాన్ని ఉద్బోధించే కవిత్వం అని విభజించి యీ మూడోరకం సాహిత్యమే గొప్పది. యిలాంటి సాహిత్యాన్ని సృష్టించిన గోర్కీలాంటివారు గొప్పవారని రాసాడు.

'మై భూకాహుఁ' అనే కవితలో నజ్రుల్ ఒక పిచ్చిస్త్రీని వర్ణించాడు. ఆమె కళ్ళనిండానీళ్లు, కాని నిప్పులు కక్కుతూ. ఆమె ఒకే ఒక్క కేక తనకు ఆకలిగావుందని. ఎంతోమంది యువకులు ఆమె పిలుపు వినాలనుకుంటారు. కాని తల్లిదండ్రులాపుతారు. కాని ఆ పిలుపు ఆగశక్యం కానిదీ, ఆపశక్యం కానిది ఎంతోమంది వచ్చి ఆమెకు ఆహారం కావాల్నేమో అడుగుతారు. పల్కదు. బట్టలు కావాలేమో అడుగుతారు. పల్కదు. ఆమె ఒకే ఒక్క కేక మరింత బిగ్గరగా ఆకలి. అప్పుడు ఆ యువకులంతా ఆమెను తమ తల్లిగా గుర్తిస్తారు. వారి రక్తం ఉడికిపోతుంది. తల్లి తమరక్తం కోరుతున్నదని తెలుసుకుంటారు. తమరక్త తర్పణం చేస్తారు. ఉదయం చూస్తే తల్లి పిచ్చిది కాదు. తన పిల్లలపైన దయనూ చిరునవ్వునూ కురిపిస్తున్న దేవత. పిల్లలుకూడా చావ లేదు. వాళ్లు అమరులయ్యారు. కొందరి కంఠాలు ఉరితాళ్ళకు వేలాడుతూ నీలంగా మారాయి. కొందరి కంఠాలు హంతకుని కత్తిగంటుమీద ఎర్రగా మిగిలాయి. ఇదీ కథ.

విప్లవ రక్తం, త్యాగం ఎంత గొప్పవో దీనికి వివరణ అనవసరం అనుకుంటాను. ఆ రోజుల్లో యిది గొప్ప సంచలనాన్ని కలిగించింది.

ఇబ్రహీంఖాన్ అనే సుప్రసిద్ధ రచయితా, విద్యావేత్త నజ్రుల్‌ను విప్లవమార్గాన్ని వదిలి యిస్లాం మార్గాన్ని అనుసరించమని హితవు చెప్పాడు. తాను నిజమైన యిస్లాం తత్వంలోవున్నాడు కాబట్టే విప్లవ మార్గంలోకూడా వున్నానని నజ్రుల్ సమాధానం చెప్పాడు. హిందూ ముస్లిం సమైక్యతకొరకు తన జీవితాన్ని ధారపోసాడు ఆయన. ఇవ్వాళ బెంగాలీలు తాము హిందువులమూ కాము, ముస్లిములమూ కాము బెంగాలీలము అనుకోవడానికి నజ్రుల్‌లాంటి వారి ప్రభావమే కారణం.

నజ్రుల్‌కు విప్లవమంటే సౌందర్యం. ఆయనకు సాహిత్యకృషి, జీవితాన్వేషణ, ప్రేమ, స్నేహం, దేశం చివరకు తన ఖైదీ జీవితంకూడా సుందరంగానే కన్పించినవి. మాతృదేశం కష్టాలను తొలగించి, విముక్తికొరకు సాగించే పోరాటం, అసమానతలను తొలగించి అవిభక్త భూమినిచూసే విధికూడా ఆయనకు సుందరంగానే కన్పించినవి. ఆయన కళాజీవితాన్ని, ఆయన కర్తవ్యజీవితాన్ని యీ సౌందర్యాన్వేషణ ముడివేసింది. కనుకనే ఆయన కవి అయ్యాడు, ఉద్యమ నాయకుడు అయ్యాడు.

'ఖుదీరామ్ తల్లి' అనే రచనలో 'ఖుదీరామ్‌బోస్' అనే 19 సం॥ ల పిల్లవాని జీవితాన్ని చిత్రించాడు. ఖుదీరామ్ బెంగాల్ విప్లవ ఉద్యమంలో పాల్గొని ప్రాణాలు అర్పించిన మొట్టమొదటి యువకుడు. చనిపోతూ తన చిన్నమ్మ గర్భంలో మళ్ళీజన్మ ఎత్తుతానని ఖుదీరామ్ అన్నట్టు బెంగాల్‌లో ఒక సుప్రసిద్ధమైన జానపదగీతం వున్నది. ఆ విషయాన్ని ప్రస్తావించి నజ్రుల్ "పుట్టిన ప్రతిపిల్లవాడు ఖుదీరామేనని వాళ్ళను యుద్ధరంగానికి పదులవలసిందని" తల్లులను ఉద్బోధిస్తాడు. 'మందిర్ మస్జిద్' అనే వ్యాసంలో మతకలహాల గురించి ప్రస్తావించి యీ యిటుకతో కట్టిన పీఠాలకొరకు వందలాది మందిని బలియివ్వడం మూర్ఖత్వం అంటాడు.

నజ్రుల్ యిస్లాం జీవిత తత్వమంతా సౌందర్యం కోసం సాగిన అనంతమైన అన్వేషణ. ఇది బాధలనుండి, దుఃఖం నుంచి విప్లవ మార్గానపడి చెడును నాశనం చేయడానికి ప్రపంచపు అంచులదాకా సాగిన ప్రయాణం. సముద్రంమీది అలలను గురించి రాస్తూ

"ఇద్దరమూ ఒకేబాధతో తపిస్తున్నాం,<br>నీవూ నేనూ అలలు అలలై దుఃఖిస్తున్నాం"

అని వెంటనే అలలను అన్వేషణకై సాగిన సైనికులంటాడు. తుఫాను యీ అన్వేషణకు లొంగుతుంది. మేఘాలు జలచరాలు అనుసరిస్తాయి ఎంతోలోతున ముత్యాలహారం లభిస్తుంది.

"తుఫాను తలుపులకేసి సంకెళ్ళను పగులగొడుతున్నది.
వీరుడా లే తలుపు తీయి
గ్రీష్మ సూర్యుడు దాని పదునైన పిలుపు వింటున్నాడు.
యువకులు సాగిస్తున్న కొత్త మార్చ్‌కు
విజయం లభిస్తుంది"
"విప్లవ దేవత నీకొరకు వేచివున్నది
ఒక యుగం ముగిసిపోతున్న దన్న
సందేశాన్ని తనతో తెచ్చింది
కాని మనం లేవలేదు
ఈసారి మనం లేవాలి.
వికారమైన శత్రుసైనికుడు
రహస్యమార్గం గుండా అర్ధరాత్రి వచ్చాడు
అకస్మాత్తుగా వెనుకనుంచి కొట్టాడు
చక్కగా వెలిగిన నీమార్గం నిండా
చీకట్లు చిమ్మాడు.
నిందల రాళ్లతో అడ్డంగా కొండలు కట్టాడు
మార్గంలో అసత్యాల కందకాలు తవ్వాడు
కళ్ళమీద ముఖంమీద
పిరికితనపు నైతిక సందేశాన్ని రాసుకున్నాడు
నీ వెలుగును పూడేసే ప్రయత్నం చేస్తున్నాడు
ఓ సూర్యుడా యింక రావాల్సిన వేళఅయింది
ఏడు సముద్రాల నీళ్ళను దాటి
నిజమైన సంతోషపు తీరాలను చేరాలి మనం
ఓ విప్లవ సైన్యాధికారి
రక్తదైవమా పలుకు పలుకు.
నువు మంచివీ నువు అందానివి
ఈ మండుతున్న భూమ్మీది నక్కల మధ్యకు రా

మాకు బలాన్నీ, ఆశనూ, విశ్వాసాన్నీ యివ్వు.
ఈ శత్రువులు పన్నిన లక్కయింటి తల్పులు తెరు
సందేహాలన్నీ పోనీ
ఆకాశపు అంచుల నర్తించే దేవత
అన్నిదిక్కులా యువకుల విజయాన్నిగురించి పాడనీ
వికారమైన అసత్యవాది చావనీ
సంతోషమా, సౌందర్యమా రా
వెలుగుతో నిండిన రూపమా రా"

రవీంద్రుడు నజ్రుల్‌ను శాంతినికేతన్‌కు వచ్చి విద్యార్థులకు పాటలు నేర్పమన్నాడు. నజ్రుల్‌వంటి కళాకారుడు రాజకీయాల్లో తలమున్కలు కావడం టాగూర్‌కు యిష్టంలేదు. కాని నజ్రుల్ దృష్టివేరు. ఆయనకు రాజకీయ స్వాతంత్ర్యం లేకపోవడం ఒక పెద్ద విషాదంగా, ఎన్నో రూపాల్లోవున్న సాంఘిక అసమానతలు, అన్యాయాలు భరించరాని బాధలుగా కనిపించాయి. చుట్టూవున్న జీవితాలనుంచి వేరుపడి తాను తన సాహిత్యం ద్వారా ఏకాంతంలోకి పోదల్చుకోలేదు నజ్రుల్.

1930 నజ్రుల్ సాహిత్య జీవితంలో పాటల యుగం. ఇదివరకు చెప్పిన పుస్తకాలు కాక యింకా తొమ్మిదిపాటల పుస్తకాలు ప్రచురించాడు ఆయన. ఆయన రాజకీయ చరిత్రను బట్టి మొదట బ్రిటిష్‌వాళ్ల ఆధీనంలోవున్న గ్రాంఫోన్ కంపెనీ ఆయన పాటలను అడుగలేదు. కాని పల్లెల్లో ఆయన పాటలకున్న విపరీత ఆదరణ చూసాక ఆయనను వరుసగా తమకోసం కంపోజ్ చేయాల్సిందిగా కోరారు. ఇండియన్ బ్రాడ్ కాస్టింగ్ కార్పొరేషన్ కలకత్తా ఆయనను కంపోజర్‌గా నియమించింది. నాటకాలకు, సినిమాలకు కూడా ఆయన పాటలు రాసాడు. 'ధ్రువ' అనే సుప్రసిద్ధమైన బెంగాలీ సినిమాకు ఆయనే సంగీత దర్శకుడు. తరువాత చాలాకాలానికి 1952 లో వెలువడిన 'బుల్‌బుల్' రెండో సంపుటిలో యీ పాటలన్నీ వున్నాయి.

ఆయన ఆవేశతీవ్రతయే ఆయన పాటలకు బలం. సంగీతం ఆయననుండి యింకిపోని ప్రవాహంలా వచ్చేది. శాస్త్రీయ శృతులనుండి జానపద శృతులదాకా ఆయన కట్టని బాణీలేదు. ఆయన అరబిక్, పర్షియన్ బాణీలనుకూడా ఎంతో సహజంగా మలిచేవాడు.

బెంగాలీ కవిత్వంలోకి గజల్‌ను ప్రవేశపెట్టినవాడు నజ్రులే.

1942 లో ఒక సాయంకాలం కలకత్తా శాంబజార్‌లోని తనయింటి నుంచి నజ్రుల్ బయటకు వెళ్లాడు. అవి రెండో ప్రపంచయుద్ధం రోజులు కలకత్తా నగరమంతా బ్లాక్‌ఔట్ చేయబడ్డది. ఆ సమయంలో నజ్రుల్ యోగసాధనలో వున్నాడు. ఆరాత్రి నజ్రుల్ తిరిగిరాలేదు. ఆయన కొడుకులు సవ్యసాచి, కాశీపాదగుహారాయ్ ఆయనను వెదకడానికి వెళ్ళారు. కాని దొరుకలేదు. తెల్లవారి పోలీసుస్టేషన్ నుంచి నజ్రుల్ కామర్‌హాట్‌లో కనిపించాడని స్థానిక వైద్యశాలలో వున్నాడని వార్తవచ్చింది. ఆరాత్రి బహుశా అతడు దక్షిణేశ్వరానికి పోతూవున్నాడని, బేరక్‌పూర్ ట్రింకురోడ్డు మీద తన ఆలోచనలతో తాను సాగుతూవుంటే సైనికుల ట్రిక్కులు భయంకరంగా ఆయన పక్కనుంచి దూసుకపోతున్నాయి. ఆయన ప్రమాదాన్ని శంకించి ప్రజలతన్ని రోడ్డుమీంచి లాగి దవాఖానాలోవేశారు. 1942 జులై 9 రోజు కలకత్తా రేడియోస్టేషన్‌లో తన రచన రికార్డుచేస్తూవుంటే ఆయన నాలిక పిడుచకట్టుకపోయింది. మాటలురాలేదు. అదే ఆఖరు. త్వరలోనే ఆయన మేధస్సుకూడా స్వాధీనం తప్పింది. ఎన్ని ప్రయత్నాలుకూడా ఆయనను తిరిగి మామూలు మనిషిని చేయలేక పోయాయి 1953 లో ఆయనను యూరప్‌కు కూడా పంపించారు. కాని లాభం లేకపోయింది.

బెంగాల్ ఒక విచిత్రమైన దేశం. ఒక అపూర్వమైన దేశం. ఎన్నో భావాల ప్రవాహాల కూటమి. ఇస్లాం. చైతన్య వైష్ణవం, శక్తి, దేశభక్తి, విప్లవం అన్నీ కలగలసి ఒక గొప్ప జాతిగా నిలిచిన దేశం. ఒక్కమాటలో నజ్రుల్ బెంగాల్ అభివ్యక్తి. నజ్రుల్ అర్థం కావాలంటే బెంగాల్ అర్థం కావాలి. బెంగాల్ అర్థం కావాలంటే నజ్రుల్ అర్థం కావాలి. ఏ బెంగాల్ అన్న ప్రశ్నకు అర్థంలేదు. ఏ బెంగాల్‌కు నజ్రుల్ ప్రతీక అనే మాటకు అర్థంలేదు. నజ్రుల్‌కు ఒకటే బెంగాల్. రెండు బెంగాల్‌లకు ఒక్కడే నజ్రుల్. పశ్చిమ బెంగాల్‌లో పాడుకునే బవుల్‌బాణీలు తూర్పు బెంగాల్లో పాడుకునే భాటియాల్ బాణీలు నజ్రుల్‌కు ఎంతో యిష్టం. ఆ యా బాణీల్లో రాసిన నజ్రుల్ పాటలు ఆ యా బెంగాల్‌లకు ఎంతో యిష్టం. అందుకే యివ్వాళ ముక్తిఫౌజ్

"మేం యుద్ధభూమికి వెళ్ళేమార్గంలో
నజ్రుల్ గీతాలకు లయకలుపుతూ ముందడుగువేస్తాం
మేం జైళ్ళలోకి తొయ్యబడేప్పుడు కూడ
నజ్రుల్ గీతాలు పాడుతూనే వుంటాం"

అంటున్నది.

(ఈ వ్యాసానికి నేషనల్ బుక్‌ట్రస్టు ప్రచురించిన బసుధా చక్రవర్తి యింగ్లీషులో రాసిన ఖాజీ నజ్రుల్ యిస్లాం అనే పుస్తకం ఆధారం)

ఉత్తమ కవితాభిరుచిగలవారికి

పిలుపు

రెంజిమ్ శివసాగర్ పార్వతీవంటి సరికొత్త కవుల కవితలతో

కవితా సంకలనం

సృజన ప్రచురణలద్వారా తేదల్చాం.

పాఠకులు, అభిమానులు తమకు తోచినంత ఆర్థిక సహాయంచేసి

యీ సంకల్పం వీలయినంత త్వరలో పుస్తకరూపం

పొందేలా చూస్తారని ఆశిస్తున్నాం.

సృజన ప్రచురణలు :

4/729, కుమార్‌పల్లి,

హనుమకొండ, వరంగల్-1. (ఆం.ప్ర.)



Edited Printed & Published by Varavararao for 'Sahithee Mithrulu'

80 Pages 100 Paise